


## మీరు మృదువుగా వేపొరబ్ రాస్తే అది వెంటనే వెచ్చదనాన్నిచ్చి హాయిని గొలుపుతుంది... మీ పిల్లవాడు సులభంగా శ్వాసను పీల్చుకొని రాత్రంతా హాయిగా నిద్రపోతాడు.

బాధ నివారణకు మీ పిల్లవాడు మీ మీద ఆధారపడతాడు. అతడు జలుబుతో బాధపడుతున్నప్పుడు విక్స్ వేపొరబ్ రాయండి. ఛాతీ గొంతుక, వీపు మరియు ముక్కుచుట్టుప్రక్కల మీ ప్రేమపూర్వక చేతులతో విక్స్ వేపొరబ్ మర్దన చేస్తే, మీ కళ్ల ముందే ముక్కు దిబ్బడ పోవడం ప్రారంభమవుతుంది. అతడు తిరిగి సులభంగా శ్వాసను పీలుస్తాడు. ఎందుకంటే ఔషధ ఆవిరులు ఏడు సెకండ్లలోనే జలుబు బాధపున్న చోట్లకి చేరతాయి. అప్పుడు పిల్లవానిని చక్కగా పరుపు మీద పడుకోబెట్టండి.

అతడు బాగా నిద్రపోతూంటే వేపొరబ్ రాత్రంతా పని చేస్తూంటుంది. తెల్లవారేటప్పటికి జలుబు బాధపుంతా పోతుంది, అతడు లేచేటప్పటికి హాయిగా, ఆరోగ్యంగా వుంటాడు.... ఆటలతో మురిపించే మీ ముద్దు బిడ్డ.




# విక్స్ వేపొరబ్ జలుబులకు ఈ రాత్రేరాయండి

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు





ఇవి గాక ఫోటో శీర్షికల పోటి
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.



విడి ప్రతి
0-75 పైసలు

సంవత్సర చందా
రూ. 8-40

వస్తూంది!

వాహినీ వారి

# రంగులరాట్నం

నిర్మాత-దర్శకుడు: బి.యన్. రెడ్డి

" నాకున్నవి రెండు కళ్ళు
ఏ కంటికి దెబ్బ తగిలినా బాధ ఒక్కటేగా "





విజయ రిలీజ్

గంగాధర్


దిలీప్, యీ సాయంత్రం నీతో క్యారమ్సు ఆడుదా మని వచ్చాంమేం.
అంత విచారంగా వున్నావేం దిలీప్?
నా రామచిలుక - రామూ యీ మిట్టమధ్యాహ్నం ఎగిరిపోయింది.
దిగులుపడకు. పారిపోయిన పెంపుడు పక్షులు, జంతువులు తిరిగి ఇంటికి వచ్చేస్తా యని మా నాన్న చెప్తుంటేవిన్నా.


దిలీప్ బృందం
ఎగిరిపోయిన రామచిలుకను
పట్టుకున్నారు
కీచు కీచు
టప టప
అదిగో రామూ అరుపులా వినిపిస్తోంది!


అలా వెళ్లి చూద్దాం పదండి.
నా 'ఎవరెడి' టార్చి తెస్తా నుండండి.


ఎక్కడైనా కనిపించిందా?
లేదు. నాకేం కనిపించడంలేదు.


దిలీప్, అదిగో రామూ. ఆ తీగె మీద కూర్చుంది.
అలాచూడు. రామూ పిల్లికంట పడింది.
అదే, అదే నా రామూ.


ఎవర్నీ పిలవకు. రామూ బెదిరి ఎగిరిపోతుంది. అశోక్, మేడమీదకెళ్లి కిటికీలోంచి ఆ పిల్లిని తరిమేయ్.


పిల్లి పారిపోయింది. రామూమీద నా 'ఎవరెడి' కాంతిపడేలాచేస్తా. కళ్లు కనిపించవ్. ఎగిరిపో లేదు. ఓ నౌకర్ని పిల్చి రామూను పట్టుకో మనండి.


రామూ పట్టుబడింది. హాయ్ హాయ్!
'ఎవరెడి' టార్చి నా దగ్గ రుండడం నిజంగా అదృష్టమే.

తప్పక చూడండి!



రవీంద్ర ఆర్ట్ ప్రొడక్షన్స్

# డాక్టర్ ఆనంద్

స్క్రీన్‌ప్లే-దర్శకత్వం: వి. మధుసూదనరావు :: నిర్మాత: డి.వి.రెడ్డి

ఆంధ్ర: రాయల్ ఫిలిమ్స్..... సీడెడ్: జయలక్ష్మి..... నైజాం: యస్.యన్.ఫి.పి....

Roopkala

VIJAYA












గ్వాలియర్ & హైదరాబాదు

OJB-136 TL

# కుటుంబము అంతటికి ఫోస్ఫోమిన్® వల్ల ఆరోగ్యము కలుగును

ఫోస్ఫోమిన్ పండు రుచిగల ఆకుపచ్చ విటమిన్ టానిక్. దీనిలో విటమిన్ బి కాంప్లెక్స్ మరియు అనేక గ్లయిసరో ఫాస్ఫేట్లు గలవు. వాటివలన మీ కుటుంబము దారుఢ్యముగా, సరదాగా, ఆరోగ్యముగా నుండును. ఇంట్లో ఫోస్ఫోమిన్ ఉంచండి. దానితో అలసట, ఆయాసము ఇక ఎంత మాత్రమూ వుండవు. ఫోస్ఫోమిన్ శక్తి నిచ్చును. ఆకలిని అధికము చేయును. సహన శక్తిని పెంపొందించును. మరియు శరీరము యొక్క రోగ నిరోధక శక్తిని ఎక్కువ చేయును. కుటుంబములో అంతా ఆరోగ్యముగా వుండడానికి రహస్యం ఫోస్ఫోమిన్.




SQUIBB® ® 

SARABHAI CHEMICALS

Shilpi SC281ATel.



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ప్రపంచంలో సత్వవంతులు ఎప్పుడూ రాణిస్తారు. తమ మనసు ఒక దుర్ఘటమైన లక్ష్యంమీద లగ్నమైనప్పుడు దాన్ని సాధించటానికి ఎంత కృషి అయినా చేస్తారు. ఇందుకు ఉదాహరణ నిశ్చయదత్తుడు. ఇందుకు విరుద్ధమైన స్వభావాలు గలవారు హీనమైన పద్ధతులు అవలంబిస్తారు. ఇందుకు ఉదాహరణలు, అర్థలోభుడు [బేతాళ కథ], కృపాణసింహుడు [శంఖధ్వని]. వారు విజయం సాధించినా దక్కించుకోలేరు.

సంపుటి 39 నవంబర్ '66 సంచిక 5

CHITRA



# భారత చరిత్ర



తన అనుచరులు కొందరికి ఉత్తర ప్రాంతాలను జయించటం అంతగా ఇష్టం లేదు, కాని బాజీరావు శాహూజీని ఒప్పించాడు. హిందూరాజులకు తన కృషి ఆదరణీయంగా ఉండగలందులకు అతను "హిందూ పాద్ పాద్షాహీ" (హిందూ సామ్రాజ్యం) అన్న నినాదాన్ని లేవదీశాడు.

1723 డిసెంబరులో అతను మాల్వాపై దాడి చేసినప్పుడు హిందూ రాజులు అంతులేని త్యాగాలు చేసి అతనికి తోడ్పడ్డారు. అంతర్యుద్ధాల ఫలితంగా గుజరాతు మహారాష్ట్రులకు చిక్కింది. అయితే మహారాష్ట్రులలోనే బాజీరావుకు ఒక ప్రతి పక్షం ఏర్పడింది. దానికి నాయకుడు త్రింబక్‌రావ్ ధాబాదే అనేవాడు. అతను గుజరాతుకు సేనాపతి. బాజీరావు పైగల ఈర్ష్య కొద్దీ, కోల్హాపూరును ఏలే శివాజీ వంశస్థుడైన రెండవ శంభూజీ రాజా, నిజాముల్ ముల్క్‌లు త్రింబక్‌రావుతో చేరారు. అయితే బాజీరావు యుక్తిగా తన శత్రువుల ఆలోచనలను భగ్నం చేసేశాడు. 1731 ఏప్రిలు 1 న బిల్హాపూరు మైదానం మీద యుద్ధం జరిగింది. అందులో త్రింబక్‌రావు ఓడిపోయి, ప్రాణాలను కోల్పోయాడు. బాజీరావు సాధించిన ఈ విజయం పేష్వాల చరిత్రలో ఒక ప్రముఖ ఘట్టం. దీనితో అతన్ని ప్రతిఘటించగల శత్రువు లెవరూ లేకుండా పోయారు. అతను 1731 ఆగస్టులో నిజాముల్‌ముల్క్‌తో ఇలా సంధి చేసుకున్నాడు: నిజాముల్‌ముల్క్ తన అధికారాన్ని దక్షిణదేశంలోనూ, పేష్వా ఉత్తర దేశంలోనూ యథేచ్ఛగా కొనసాగించుకోవచ్చును.

అదృష్టవశాన బాజీరావుకు అంబరు రాజైన 2 వ జయసింగు మైత్రీ, ఛత్రసాల్ బుందేలా మైత్రీ లభించింది. బాజీరావు

1737 లో ఢిల్లీ సమీపానికి తన సేనలను తరలించుకు పోయాడు. అయితే పాదుషా బాధ పడతాడని ఢిల్లీనగరం పై దాడి చెయ్యలేదు. ఈ మహారాష్ట్రుల పీడ వదిలించుకోవాలని పాదుషా నిజాముల్ ముల్క్ సహాయం కోరాడు. ఆరేళ్ళ క్రితం తాను బాజీరావుతో చేసుకున్న ఒప్పందాన్ని ఉల్లంఘించి నిజాముల్‌ముల్క్ బాజీరావును అణగదొక్కాలని బయలుదేరి వెళ్ళాడు. భోపాల్ వద్ద ఉభయ పక్షాలకూ జరిగిన యుద్ధంలో నిజాముల్‌ముల్క్ ఓడి పోయి బాజీరావుతో కొత్త సంధి చేసుకున్నాడు. దీని ఫలితంగా మాల్వా యావత్తూ బాజీరావు దయింది. నర్మదా చంబల్ నదుల మధ్య నున్న దేశం పై అతనికి అధిపత్యం లభించింది. దీనిని పాదుషాయే ధృవపరిచాడు; పేష్వా ఖర్చుల కింద 50 లక్షల రూపాయలను ఇచ్చుకోవలిసి వచ్చింది.

ఈ ఒప్పందం వల్ల దేశంలో కొంత భాగాన మహారాష్ట్రుల ఏలుబడి మరింత సుస్థిరమని గుర్తింపుకు వచ్చింది.



1739 లో, పశ్చిమతీరాన పోర్చుగీసుల అధీనంలో ఉండిన సాల్సెట్, బసీను లను మహారాష్ట్రులు పట్టుకున్నారు. అయితే త్వరలోనే బాజీరావును నాదిర్‌షా దండయాత్రను గురించిన వార్త కలవర పెట్టింది. అతను ఇరుగు పొరుగున ఉండే ముస్లిములతో వైరం కట్టిపెట్టి, నాదిర్‌షా పై సమిష్టిప్రతిఘటనకు గాను యత్నించాడు. కాని ఈ ప్రయత్నం ముగిసేలోపునే బాజీరావు తన 42 వ ఏట, 1740 ఏప్రిలులో అకాలమరణం వాత పడ్డాడు. అతని మరణంతో మహారాష్ట్ర సామ్రాజ్యానికి తీరని నష్టం కలిగింది. మహారాష్ట్ర సామ్రాజ్య వ్యవస్థాపకులలో అతను రెండవ వాడని చెప్పవచ్చు.

బాజీరావు హయాంలో మరాఠాల ఖ్యాతి శక్తులు బాగా పెంపొందిన మాట నిజమే

గాని, మహారాష్ట్రదేశం ఐక్యతను కోల్పో యింది. దీనికి కారణం జాగీర్దారీ విధానం తిరిగి అమలులోకి రావటం. అక్కడక్కడా అర్ధ స్వతంత్ర మహారాష్ట్ర రాజ్యాలు వెలిశాయి; కేంద్రప్రభుత్వం క్రమంగా దుర్బలమై, చివరకు భగ్నమైపోయింది. పైకి వచ్చిన అర్ధ స్వతంత్ర రాజ్యాలలో మొదటిది బిరారు; దానికి రాజు రఘూజీ భోంస్లే. అదేవిధంగా బరోడాలో గాయక్వార్లు అధిపతులయారు. బాజీరావు కింద పని చేసి కీర్తి సంపాదించిన రనోజీసింధియా మాల్వాలో ఒక ప్రాంతానికి అధిపతి అయాడు. మాల్వాలో మరొక ప్రాంతానికి అధిపతి అయిన మల్హార్‌రావుహోల్కర్ కూడా బాజీరావు కింద దక్షతతో పనిచేసిన సేనానాయకుడే.

బాజీరావు అనంతరం అతని పెద్ద కొడుకు రెండవ బాలాజీ పేష్వా అయాడు. (ఇతనినే నానాసాహెబ్ అనీ, బాలాజీ బాజీరావనీ కూడా పిలిచేవారు.) ఇతను పేష్వా కావటానికి మరాఠా నాయకు లనేకులు వ్యతిరేకించారు. కారణమేమంటే, ఇతను పద్దెనిమిదేళ్ళ బాలుడు; భోగలాలసుడు; తండ్రికి గల సామర్థ్యం ఇతనిలో లేదు. అయినా ఇతను బొత్తిగా అసమర్థుడు కాడు. సేనలను అయత్తం చెయ్యటంలోనూ, యుద్ధ తంత్రంలోనూ అతను తన తండ్రిని అనుకరించాడు.

1749 లో షాహూ చనిపోతూ రాజ్యాధికారాన్ని పేష్వాలకు దత్తంచేసేశాడు. శివాజీ వంశానికి తారాబాయి మనమడు వారసుడుగానూ, వంశవర్ధకుడుగానూ ప్రకటించబడ్డాడు. అయితే తారాబాయి ఈ ఏర్పాటును వ్యతిరేకించి, పేష్వాతో యుద్ధం చేసి, బాలుడైన రాజును పట్టి, నిర్బంధంలో ఉంచింది. అయితే యుద్ధంలో పేష్వాకే విజయం లభించింది. అదిమొదలు మహారాష్ట్ర సమాఖ్యకు పేష్వాయే నాయకుడయాడు.



# నేహ్రూ కథ

## 29



1930 జనవరి 26 న స్వాతంత్ర్య దినం వచ్చింది. దేశమంతా ఉత్సాహపూరితం గానూ, దీక్షాపూరితంగానూ ఉన్న సంగతి స్పష్టమయింది. ప్రతిచోటా పెద్ద సమావేశాలు జరిగి స్వాతంత్ర్యదీక్ష తీసుకోబడింది. దీర్ఘమైన ఉపన్యాసాలు లేకుండా ప్రశాంతంగా సమావేశాలు జరిగాయి. ఈ స్వాతంత్ర్య దినోత్సవం జరిగిన తీరును బట్టి, దేశం ఉద్యమోన్ముఖంగా ఉన్నదని గాంధీజీకి తెలిసిపోయింది. రానున్నది శాసనోల్లంఘనోద్యమం.

1921-22 లలో సాగిన సహాయ నిరాకరణోద్యమాన్ని, చౌరీ-చౌరా హింసాచర్యల కారణంగా గాంధీజీ ఉపసంహరించడం జరిగింది. ఈసారి కూడా శాసనోల్లంఘనోద్యమానికి అలాటి దుస్థితి సంభవిస్తుందా అని జవాహరు ప్రభృతులు భయపడ్డారు. గాంధీజీ ఉద్దేశంలో, సరిగా అనుసరించాలేగాని, అహింసా విధానం ఎన్నడూ విఫలం కాదు; అది ఒక్కటే సరయిన విధానం కూడా. కాని అహింసా విధానం సఫలం కావాలంటే దానికి అనుకూలమైన వాతావరణం ఉండాలని వేరే చెప్పనవసరం లేదు. అంటే, అది సార్వత్రికమైన విధానం కాదు, దానికి విజయం తథ్యమూ కాదు. ఇలా అంటే గాంధీజీకి చాలా చిరాకు. ఏ పరిస్థితులలోనైనా అహింసా విధానం సఫలమవుతుందనే ఆయన దృఢ విశ్వాసం. అందుచేత, చెదురుమదురుగా హింసాచర్యలు జరిగినా, అవి ఉద్యమంలో అంతర్భాగం కాని పక్షంలో, ఆయన ఉద్యమాన్ని ఉపసంహరించనన్నట్టు మాట్లాడాడు. ఈ మాట జవాహరు ప్రభృతులకు చాలా తృప్తినిచ్చింది.

శాసనోల్లంఘనం ఏ రూపంలో ప్రారంభమవుతుందా అని ఆశ్చర్యపడుతున్న దేశ





దేశంలోని పరిస్థితి మారిపోతున్నది. ప్రపంచంలో కూడా అద్భుత పరిణామాలు సాగుతున్నాయి. డిప్రెషన్ ఆరంభమయింది. అదొక దారుణమైన ఆర్థికసంక్షోభం. ధరలు వేగంగా పడిపోతున్నాయి. నగరాలలో వాళ్ళు సంతోషిస్తున్నారు, రైతులు ఆందోళన పడుతున్నారు.

ఈ పరిస్థితిలో గాంధీజీ దండీ సత్యాగ్రహానికి సబర్మతీఆశ్రమం నుంచి కాలినడకన బయలుదేరాడు. దండీ యాత్ర సాగుతున్నకొద్దీ దేశంలో చైతన్యం హెచ్చింది. దేశమంతటా ఉద్యమం ప్రారంభమయే ముహూర్తం దగ్గిర పడుతున్నది. అహమ్మదాబాదులో ఆలిండియా కాంగ్రెసుకమిటీ సమావేశమై, ఉద్యమానికి కావలసిన ఏర్పాట్లు ఆలోచించింది. ఈ ఏర్పాట్లను గురించి ఆలోచించవలసిన కథానాయకుడు సముద్ర తీరం కేసి యాత్ర చేస్తున్నాడు, రమ్మంటే రాడు. అందుచేత కార్యభారం జవాహరు మొదలైన వారిపైన పడింది.

ఉద్యమం ప్రారంభం కాగానే అరెస్టులు జరుగుతాయి. అందుచేత వర్కింగ్ కమిటీ సభ్యుల తరఫున నిర్ణయాలు చేసే అధికారమూ, అరెస్టయిన సభ్యుల స్థానే ఇతరులను నియమించే అధికారమూ కాంగ్రెసు

ప్రజలకు "ఉప్పు" అనే మాటను గాంధీజీ తిరుమంత్రం లాగా ఉపదేశించాడు. ఉప్పు పన్నును ప్రతిఘటించాలి, ఉప్పు చట్టాన్ని ఉల్లంఘించాలి.

ఉప్పుకూ, దేశ స్వాతంత్ర్యానికీ సంబంధమేమిటా అని జవాహరు మొదట్లో ఆశ్చర్యపోయాడు. భారతస్వాతంత్ర్యానికి గాంధీజీ ప్రతిపాదించిన పదకొండు సూత్రాలు కూడా అతన్ని ఆశ్చర్యపరిచాయి. తాను స్వాతంత్ర్యమనుకునేదీ, గాంధీజీ స్వాతంత్ర్యమనుకునేదీ ఒకటేనా అన్న అనుమానం కూడా అతనికి కలిగింది. అయితే ఆలోచిస్తూ కూర్చునే వ్యవధిలేదు. రోజు రోజుకూ





అధ్యక్షుడి కివ్వబడ్డాయి. అలాటి హక్కులే రాష్ట్ర, స్థానిక కాంగ్రెసు కమిటీల అధ్యక్షు లకు కూడా ఇవ్వబడ్డాయి. ఉద్యమం "డిక్టేటర్ల" చేత నడపబడుతుంది. "డిక్టే టరు" అన్న మాటకు చాలా ఆక్షేపణలు వచ్చాయి. బ్రిటిషు సెక్రెటరీ ఆఫ్ స్టేట్, ఇండియా వైస్రాయీ, గవర్నరులూ కూడా తాము ఆదర్శ ప్రజాతంత్ర వాదులైనట్టుగా, "కాంగ్రెసు నియంతృత్వాన్ని ఆదరిస్తు న్నది!" అని ముక్కుమీద వేలేసుకున్నారు.

కాని గత్యంతరమేమిటి? ప్రభుత్వం కాంగ్రెసు సంస్థను నిషేధించవచ్చు. సేమా వేశాలకూ, చర్చలకూ అవకాశాలుండవు. ఉద్యమ నాయకులు సొంతాన నిర్ణయాలు చేసి, వాటిని అమలు చేయవలసిందే. ఇంతకూ ఈ డిక్టేటర్ల కుండే గొప్ప హక్కే మిటి? జైలుకు నడిచేహక్కే!

ఈ విధమైన ఏర్పాట్లు పూర్తిచేసి అహ మ్మదాబాదు నుంచి తిరిగివస్తూ, మోతీలాల్ జవాహర్‌లు గాంధీజీని జంబుసర్‌వద్ద కలుసు కున్నారు. ఆయనా, ఆయనతోటి యాత్రీ కులూ అక్కడికి చేరి ఉన్నారు. అక్కడ వారు గాంధీజీతో కొద్ది గంటలు గడిపాక గాంధీజీ తన బృందంతో సహా ముందున్న మజిలీకి కదిలి వెళ్ళాడు. కర్ర చేతపట్టు



కుని, ఊతంగా అంగలువేస్తూ, నిర్భయంగా నడిచి వెళుతున్న గాంధీజీని చూసి జవాహరు హృదయం ద్రవించింది.

జంబుసర్‌లో మోతీలాల్ గాంధీజీతో ఒక ముఖ్యమైన విషయం మాట్లాడాడు. ఆయన అలహాబాదులోని తన పాత ఇంటికి "స్వరాజ్ భవన్" అని పేరుపెట్టి దేశానికి అర్పించాలని నిర్ణయించాడు. అలహాబాదు చేరుతూనే ఈ సంగతి ప్రకటించి, మోతీ లాల్ ఆ ఇంటిని కాంగ్రెసువారి పరం చేశాడు. ఆ పెద్ద భవనంలో ఒకభాగం ఆసుపత్రిగా మార్చబడింది. అయితే ఈ భవన ప్రదా నానికి సంబంధించిన రాతకోతలను మోతీ

లాల్ పోయాక జవాహరే పూర్తి చెయ్యటం జరిగింది.

గాంధీజీ పశ్చిమ తీరాన్ని చేరడం ఏప్రిల్‌లో జరిగింది. ఈలోపుగా వాలంటీర్ల శిక్షణ జరిగింది. జవాహరు భార్య కమలా, చెల్లెలు కృష్ణా కూడా మగవాళ్ళ దుస్తులు ధరించి వాలంటీరు శిక్షణ పొందారు.

ఏప్రిల్ 6 జాతీయవారారంభదినం. ఆ రోజే గాంధీజీ దండీ సముద్రతీరాన ఉప్పు చట్టాన్ని ఉల్లంఘన చేశాడు. మరి మూడునాలుగు రోజుల అనంతరం దేశ వ్యాప్తంగా శాసనోల్లంఘనోద్యమం సాగించవలసిందిగా కాంగ్రెసుసంస్థ లన్నిటికీ పిలుపు వెళ్ళింది.

ఒక్కసారిగా దేశమంతటా ఉప్పుతయారీ సాగింది. ఉప్పు ఎలా చెయ్యాలో జవాహరుకుగాని, అతని అనుచరులకుగాని తెలీదు. ఎక్కడెక్కడో దొరికిన వివరాలన్నీ చదివి, ఉప్పు తయారీ గురించి కరపత్రాలు వేశారు. కుండలూ, బొచ్చెలూ పోగుచేసి ఉప్పు తయారు చెయ్యటానికి ఉపక్రమిస్తే భయంకరమైన పదార్థం ఏదో తయారయింది. దాన్ని వేలంవేస్తే మంచి ధరకూడా వచ్చింది. ఇలా తయారు చేసిన ఉప్పు తినటానికి పనికి వస్తుందా, లేదా అన్న సమస్యలేదు. ముఖ్యమైన సంగతి ఉప్పుచట్టాన్ని ఉల్లంఘించటం. ఈ ఉద్యమం వ్యాపించిన తీరు చూస్తే జవాహరుకు ఆశ్చర్యం వేసింది.

ఏప్రిల్ 14 న జవాహరును అరెస్టు చేశారు. అతను ముందుగానే, తన అనంతరం తన కాంగ్రెసు అధ్యక్షపదవిని గాంధీజీగాని, తన తండ్రిగాని తీసుకోవాలని తెలిపాడు. ఇందుకు గాంధీజీ ఒప్పుకోకపోవటం చేత జవాహరు స్థానే మోతీలాలు కాంగ్రెసు అధ్యక్షుడుగా పనిచేయవలసి వచ్చింది.

అరెస్టయిన రోజునే జవాహరు విచారణ కూడా జరిగింది. అతనికి ఆరుమాసాల జైలు శిక్ష విధించారు.





# పాతాళదుర్గం

## 7

[సైనికులకు గుహలలో కాలశంబరుడూ, కుంభీరుడూ కనిపించలేదు. ఒక గుహలో సైనికు లిద్దరు కొండచిలువ వాతబడ్డారు. ధూమకుడికి, కాలశంబరుడి మంత్రదండం దొరికింది. ఆ సమయంలో కదంబదేశమంత్రి ఒళ్ళంతా గాయాలతో గుర్రం మీద వచ్చి, తమ రాజైన ఉగ్రసేనుడి ముందు, 'సర్వనాశనం!' అంటూ పడిపోయాడు. తరవాత—]

గంగాధరుడు వైద్యుణ్ణి పిలిచి కదంబ మంత్రి గాయాలకు చికిత్స చేయమన్నాడు. ఇద్దరు సైనికులు మంత్రిని ఒక రాతికి ఆనించి కూర్చోబెట్టారు. రాజు ఉగ్రసేనుడు అతడి ముందుకు వచ్చి, "అమాత్యా! ఏమిటిదంతా?" అని అడిగాడు.

గంగాధరుడు వైద్యుణ్ణి త్వరగా గాయాలకు కట్లు కట్టమని చెప్పి, ఆ పని పూర్తి కాగానే, "అమాత్యా! ఇప్పుడు చెప్పండి. కదంబనగరాన్ని శత్రువు లేమైనా ఆక్రమించుకున్నారా?" అని ప్రశ్నించాడు.

కదంబమంత్రి దాహం కావాలని సంజ్ఞ చేశాడు. సైనికు డొకడు ఆయనకు సొరబుర్ర లోంచి నీరు పోశాడు. మంత్రి దాహం తీర్చుకుని, కొంత స్థిమితపడి, "వీరు కుంతల దేశ మహామంత్రుల్లా వున్నారు," అంటూ గంగాధరుడి కేసి తలాడించి, "కదంబ నగరం మీదికి ఎవరో శత్రువులు దాడి



కొచ్చారని వినగానే, నేను ఆ వచ్చిన వారు కుంతలదేశ సైనికులై వుంటారని భావించాను," అంటూ ఉగ్రసేనుడి కేసి భయంగా చూశాడు.

రాజు ఉగ్రసేనుడు కోపోద్రేకంతో వణికి పోతూ, "కదంబనగరం శత్రువుల వశమై పోయింది, అదేనా నీవు చెప్పదలుచుకున్నది?" అంటూ మంత్రిని గద్దించి అడిగాడు.

"మహారాజా, మీరు ఉద్రేకపడకండి," అంటూ గంగాధరుడు, ఉగ్రసేనుణ్ణి శాంత పరిచి, "ఇంతకూ ఆ శత్రువు లెవరు?" అని కదంబ మంత్రిని అడిగాడు.



"శత్రువులు పరదేశీయు లైతే నగరం ఒక పట్టాన వాళ్ళ వశం అయి వుండేది కాదు. విద్రోహం తలపెట్టింది కదంబ పౌరులే. వాళ్ళు ఉరుముల్లేని పిడుగుపాటు లాగా, మబ్బుల్లేని జడివాన లాగా హఠాత్తుగా వచ్చి నగరం మీద పడ్డారు. నగర పౌరుల్లో చాలామంది వాళ్ళతో ఏకమయ్యారు. ఇంకే ముంది, క్షణాల మీద రాజభవనం ఆక్రమించుకుని బొక్కసం కొల్లగొట్టారు," అన్నాడు కదంబమంత్రి.

"బొక్కసం కొల్లగొట్టారా? నా బొక్కసం! ఎన్నో తరాల నుంచి కష్టపడి కూడబెట్టిన డబ్బు, బంగారం, వెండీ—అంతా," అంటూ ఉగ్రసేనుడు గాయపడ్డ బెబ్బులిలా భీకరంగా కేక పెట్టి, "ఇంతకూ ఆ రాజద్రోహులకు నాయకు లెవరు? వాళ్ళ నిప్పుడే నా కత్తికి ఎర చేస్తాను. ఏదిరా, నా యుద్ధాశ్వం!" అని కత్తి దూసి, దూరంగా మేస్తున్న తన గుర్రం కేసి పరిగెత్తబోయాడు.

గంగాధరు, ఉగ్రసేనుడి రెక్క పట్టుకుని అపుతూ, "మహారాజా! తమకు కుమార్తె ఎక్కువో, ఖజానా ఎక్కువో నా కర్థం కావటం లేదు. కొంచెం శాంతించండి, తొందరపడి లాభం లేదు," అని,



కదంబమంత్రితో, "ఆ విద్రోహులకు నాయకు లెవరైనా వున్నారా, లేక అంతా వట్టి అలగా జనమా?" అని ప్రశ్నించాడు.

"మహామంత్రీ, వాళ్ళకు నాయకులు లేకపోవటం ఏమిటి? ధూమక సోమకు లనే పితృ భ్రాతృ హంతకు లున్నారే? వాళ్ళే ఆ మూకకు నాయకులు. 'బొక్కసం దోచండి! అది మన నుంచి పన్నుల రూపంలో బలవంతంగా వసూలు చేసిన ధనమే!' అంటూ వాళ్ళు జనాన్ని ధనాగారం మీదికి ఎగదోలారు," అన్నాడు కదంబమంత్రి.



సోమకుడు పళ్లు కొరికి, ముక్కుపుటా లెగరవేస్తూ కత్తి దూయబో యేంతలో ధూమకుడు అతన్ని కనుసైగలతోనే వారించి, గంగాధరుడి ముందుకు వచ్చి, "ప్రభూ, చూశారుగదా, యీ అన్యాయం? గడిచిన రెండు రోజులుగా మేము కదంబ నగర ఛాయల్లోనే లేము. కదంబరాజ్య పాలకు లెంత నీచులో, అసత్యవాదులో యిప్పటికైనా మీ కర్థమైందా?" అని ప్రశ్నించాడు.

గంగాధరుడు కదంబమంత్రి కేసి కొరకొర చూస్తూ, "గత నలభైఎనిమిది గంటల్లో కదంబ పాలకులు ఒక్కగానొక్క నిజమైనా పలికిన పాపాన పోలేదు. యువరాణిని రాక్షసు డెత్తుకుపోయాడు, కోశాగారం కొల్ల గొట్టబడింది, రాజ్యం శత్రువుల హస్తగత మైంది, పాలకు లిద్దరూ ప్రమాదకరమైన గాయాలతో కొట్టుమిట్టాడుతున్నారు. ఇంత కన్న చేసిన పాపాలకూ, ఆడిన అబద్ధాలకూ మరేం ప్రాయశ్చిత్తం జరగాలి?" అన్నాడు.

రాజు ఉగ్రసేనుడు అవమానంతో కుంగిపోతూ, "మహామంత్రీ, జరిగినదానికి నేను చాలా సిగ్గుపడుతున్నాను. రాజ్యం పోయిందన్న దిగులు నా కేం లేదు. నా కుమార్తెను రాక్షసుడి నుంచి కాపాడే ప్రయత్నంలో మీ నుంచి సహకారం అపేక్షిస్తున్నాను," అన్నాడు.





"సహకారానికేం, మహారాజా! శశికాంతుణ్ణి మాంత్రికు డెత్తుకు పోయాడని నా అనుమానం," అంటూ గంగాధరుడు ఆగి, "ఆ ధ్వనులేమిటి? తప్పెట మోతలూ, కేకలూ మీకు వినబడటం లేదా?" అంటూ తన సైనికుల కేసి తిరిగి ప్రశ్నించాడు.

సైనికుల్లో యిద్దరు ముగ్గురు అక్కడ ఎత్తుగా వున్న రాళ్ళ మీది కెక్కి, తప్పెట ధ్వనులూ, కొమ్ముబూరల మోతలూ విన వస్తున్న దిక్కు కేసి చూసి, "ప్రభూ! జనం గుంపులు గుంపులుగా యిటు కేసి వస్తున్నారు. వాళ్ళల్లో కొందరు నాట్యాలు చేస్తూ తప్పెటలు వాయిస్తున్నారు," అని చెప్పారు. అంతలో ఒక అశ్వికుడు చెట్లమధ్య నుంచి బాణంలా దూసుకు వచ్చి ఉగ్రసేనుడికి అల్లంత దూరంలో గుర్రం దిగాడు. అతడు ధరించిన దుస్తులు అక్కడక్కడా కాలి వున్నవి. మొలలో ఖడ్గం లేని ఖాళీ ఒర వేలాడుతున్నది. అతడు ఉగ్రసేనుడి కోశాధికారి!

"కోశం కొల్లగొట్టేశారు, మహారాజా! నేను ప్రాణాలతో పారిపోయి వచ్చాను. జనం మీ కోసం ఇటు కేసి వస్తున్నారు. పారిపోకపోతే ప్రాణాలు దక్కవు," అంటూ కోశాధికారి, రాజు కాళ్ళ మీద పడిపోయాడు.

"ఎక్కడికి పారిపోవటం? ఎలా పారిపోవటం?" అన్నాడు గంగాధరుడు, ధూమక సోమకుల్ని దగ్గిరకు రావలసిందిగా సంజ్ఞ చేస్తూ.

"సైన్యాలను సమకూర్చుకుని, ఆ రాజద్రోహుల్ని హతమార్చండి, మహారాజా!" అంటూ కదంబమంత్రి తమ రాజుకు సలహా పలికాడు.

"సైన్యాలు!" అంటూ గంగాధరుడు హేళనగా నవ్వి, "పౌరు లందరూ ఎదురు తిరిగారు, యింక సైన్యాలను గాల్లోంచి సమకూరుస్తావా, మంత్రీ!" అని కదంబమంత్రిని కోప్పడి, "ఇప్పుడు మిమ్మల్ని



రక్షించవలసిన వాళ్ళు ధూమక సోమకులు. ఏం, ధూమక సోమకుల్లారా! ఆ కార్యం మీరు నిర్వహించగలరా?" అని అడిగాడు.

"ఈ రాజూ, మంత్రీ ప్రాణాలు కాపాడ గలమేమో గాని, వాళ్ళ రాజ్యం మాత్రం తిరిగి వాళ్ళకు యిప్పించలేం," అన్నాడు ధూమకుడు.

"రాజు లేని రాజ్యం అంటూ ఎక్కడా వుండదు. నీ కేమైనా మతి పోయిందా, ధూమకా?" అన్నాడు గంగాధరుడు కసురు తూన్నట్టు.

"మహామంత్రీ! నాకు రాజ్యం అవసరం లేదు. ఇప్పుడే నా కుమార్తెను వెతుక్కుంటూ



అరణ్యాలు పట్టి పోతాను," అన్నాడు ఉగ్రసేనుడు.

"రాజుతోనే గదా మంత్రి బతుకు!" అన్నాడు కదంబమంత్రి.

"రాజ్యమే లేనప్పుడు, యింక కోశాగారం ఎక్కడిది! నేనూ మీతోపాటే వస్తాను," అన్నాడు కోశాధికారి.

"మీలో ఒక్కరిని కూడా ఆ వచ్చే జనం ప్రాణాలతో యిక్కణ్ణించి పోనివ్వరు," అంటూ సోమకుడు రంకె వేశాడు.

"ఇక్కడ అజ్ఞాపించేవాణ్ణి నేను. అనవసర ప్రసంగా లెవరూ చేయకూడదు," అంటూ గంగాధరుడు కళ్ళెర్రచేసి, "ఉగ్రసేన మహారాజూ, అతడి పరివారమూ కుంతలదేశ రాజుకు శరణాగతులు. వాళ్ళ ప్రాణాలు కాపాడవలసిన బాధ్యత నాది. ధూమకా! సోమకా! మీ రిద్దరూ యిప్పుడే బయలుదేరి పోయి, ప్రజల్ని కదంబ నగరం కేసి తిరుగుముఖం పట్టించాలి. వాళ్ళు మొండిగా ముందు కొచ్చారో రక్తపాతం జరుగుతుంది," అని చెప్పి, తన సైనికులను యుద్ధసన్నద్ధులు కావలసిందిగా అజ్ఞాపించాడు.

ధూమక సోమకులకు,కుంతలదేశమంత్రి ఆజ్ఞ ఆశ్చర్యాన్నీ, కోపాన్నీ కూడా తెప్పిం





చింది. సోమకుడు శపథం చేయబోయే వాడిలా చేఎత్తి ఏమో అనబోయేంతలో, ధూమకుడతన్ని భుజం పట్టుకుని దూరంగా లాక్కుపోయి, "సోమూ, తొందరపాటు పనికిరాదు. గంగాధర మంత్రితో యీ సమయంలో పోట్లాట పెట్టుకుంటే, సుశిక్షితులైన అతడి సైనికులు, మన కదంబప్రజల్ని తేలిగ్గా ఓడించి, తిరిగి ఆ దుర్మార్గుడైన ఉగ్రసేనుణ్ణి సింహాసనం ఎక్కించగలరు. కనుక, మనం ప్రస్తుతానికి రాజీగా పోవటమే మంచిది," అన్నాడు.

సోమకుడు అయిష్టంగా తలవూపుతూనే, ధూమకుడితోపాటు బయలుదేరాడు. ఇద్దరూ గుర్రా లెక్కి ; విజయనినాదాలు చేస్తూ అటు కేసి వస్తున్న కదంబ పౌరులకు ఎదురు వెళ్ళారు. పౌరుల్లో కొందరు వాళ్ళిద్దర్నీ గుర్తించి, "అరుగో, ధూమక సోమకులు! వాళ్ళ నాయకత్వం కింద మనం, కుంతల దేశ రాజు శతభానుణ్ణి కూడా సింహాసనం విడిచి అడవులు పట్టి పోయేలా చేయగలం," అంటూ కేకలు పెట్టారు.

ధూమకుడు ప్రజల గుంపును సమీపించి, తప్పెటల వాళ్ళనీ, కొమ్ముబూరల వాళ్ళనీ నిశ్శబ్దంగా వుండమని హెచ్చరించి, "పౌరులారా! ఇక మీరు శాంతంగా కదంబ నగరా



నికి తిరిగిపోవటం మంచిది. ఉగ్రసేనుడూ, అతడి మంత్రి కూడా కుంతలదేశ అమాత్యుడైన గంగాధరుడి శరణుజొచ్చారు. వాళ్ళిద్దర్నీ యీ సమయంలో మీరు చంపదలిస్తే, కుంతల సైనికులతో యుద్ధం తప్పదు. అందులో మనకు విజయం కలుగుతుందన్న నమ్మకం నాకు లేదు. ఒకవేళ మనం తాత్కాలికంగా విజయవంతులమైనా, కుంతలరాజు సర్వసైన్యాన్ని వెంటబెట్టుకుని మన మీద దాడి చేస్తాడు. ఆ సంగతి గుర్తుంచుకోండి," అన్నాడు.

"అతణ్ణీ ఎదిరించి పోరాడుతాం! రాజరికం అన్నది లేకుండా చేసేందుకు ఆత్మ



ర్పణ చేయటానికి మేం సిద్ధం!" అంటూ జనం లోంచి కొందరు యువకులు పెద్దగా కేకపెట్టారు.

"ఆత్మార్పణకీ, ఆత్మహత్యకీ తేడా మీకు తెలిసినట్టు లేదు," అంటూ ధూమకుడు పెద్దగా నవ్వి, "ఆ అరిచే వీరులంతా ఇళ్ళకు పోయి కోతికొమ్మచ్చు లాడుకోండి. నేను కదంబ పౌరముఖ్యుల్ని ముందుకు రావలసిందిగా కోరుతున్నాను," అన్నాడు.

జనం దారి ఇవ్వగా నలుగు రైదుగురు వృద్ధులు ముందు కొచ్చారు. ధూమకుడు గుర్రం దిగి వాళ్ళకు నమస్కరించి, "అయ్యలారా! మీరు యిక్కడ నాయకత్వం వహించి, ఉడుకురక్తం క్రూరకారును అదుపులోపెట్ట కోరుతున్నాను. గంగాధరమంత్రి అన్నట్టు; రాజు లేని రాజ్యం వుండదు. ఇక కదంబదేశానికి ఉగ్రసేనుడు రాజుగా రావటం జరగదు. కాని, ఆయన కుమార్తె కాంతిసేన మాటేమిటి?" అన్నాడు.

"కాంతిసేన మాకు రాణీ కావాలి!" అంటూ జనంలో నుంచి కేకలు బయలుదేరినై. పౌరవృద్ధులు కూడా దానికి అంగీకార సూచకంగా తలలు వూపారు.

"అలా అయితే, అందరూ ప్రశాంతంగా కదంబ నగరానికి వెళ్ళిపొండి. రాక్షసుడు అపహరించుకు పోయిన, ఆ యువరాణిని తిరిగి తెచ్చే బాధ్యత నాది," అన్నాడు ధూమకుడు.

జనం ధూమకుడి కొకసారి జై కొట్టి నగరం కేసి బయలుదేరారు. ధూమక సోమకులు గుర్రాలను మళ్ళించి, గంగాధరుడున్న చోటుకు బయలుదేరేంతలో, ధూమకుడి నడుము నుంచి వేలాడుతున్న కాలశంబరుడి మంత్రదండం, జుయ్‌ మంటూ శబ్దం చేసి, కట్టివున్న తాడును తెంచుకుని గాలిలోకి లేచింది. సోమకుడు గుర్రం మీద లేచి నిలబడి, మంత్రదండాన్ని పట్టుకునేందుకు పై కెగిరాడు. —(ఇంకావుంది)





# అర్థలోభుడు

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగ వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, నీ లాగా పట్టు దలతో కార్యసాధన చేసేవారు చాలా అరుదు. హెచ్చుమంది అర్థలోభుడి లాగా కొద్ది ప్రయత్నంతో అధికమైన ఫలితాన్ని పొంద గోరుతారు. అయితే అలాంటి వాళ్ళు పొందే ఫలితాలు సాధారణంగా దక్కవు. శ్రమ తెలియకుండా ఉండగలందులకు నీకు అర్థలోభుడి కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

కాంచీనగరాన్ని బాహుబలు డనే రాజు పాలించే కాలంలో ఆయన కొలువులో అర్థలోభు డనే ధనికవర్తకు డుండేవాడు. అతను తన వర్తకాన్ని చూడటానికి తన బంధువులను నియమిస్తే వాళ్ళు మోసం

## బేతాళ కథలు



చేస్తారేమో నని భయపడి, ఆ పనికి తన భార్యనే నియమించాడు.

అర్థలోభుడి భార్య పేరు మానపర. ఆమె అపురూప సౌందర్యవతి. కేవలమూ అందగత్తె మాత్రమే గాక ఆమె చాలా తెలివి తేటలూ, ఇతరులతో వ్యవహరించటంలో ఎంతో నైపుణ్యమూ కలది. అందుచేత ఆమె తన భర్త ఆజ్ఞానుసారం, ఇష్టం ఉన్నవాళ్ళ తోనూ, లేనివాళ్ళతోనూ తియ్యగా మాట్లా డుతూ, తన అందంతోనూ, సంభాషణ తోనూ అందరినీ ఆకర్షిస్తూ, భర్త వ్యాపా రాన్ని మూడుపువ్వులూ, ఆరుకాయలుగా పెంపొందిస్తూ వచ్చింది. అర్థలోభుడు కూడా



తన భార్య సమర్థతకూ, నైపుణ్యానికీ సంతోషించి, ఆమెను యథేచ్ఛగా వ్యాపారం కొనసాగించనిచ్చాడు.

ఇలా ఉండగా ఒక సమయంలో సుఖధను డనే గొప్ప వర్తకుడు దేశాంతరం నుంచి వస్తూ, అంతులేని గుర్రాలూ, వస్త్రాలూ తీసుకుని కాంచీనగరానికి వచ్చాడు. అది తెలిసి అర్థలోభుడు తన భార్యతో, "సుఖధను డనే విదేశీ వర్తకుడు ఇరవైవేల గుర్రాలనూ, అంతులేని చీని చీనాంబరాల కట్టలనూ తెచ్చాడు. నువు అతని నుంచి అయిదువందల గుర్రాలూ, అయిదువేల చీనాంబరాలూ బేరం చేసి కొను. తరవాత వాటిని మన మహారాజు గారికే విక్రయించి లాభం చేసుకోవచ్చు," అని చెప్పాడు.

భర్త చెప్పిన ప్రకారం మానపర సుఖ ధను దుండే బసకు వెళ్ళి, తనకు గుర్రాలూ, వస్త్రాలూ కావాలని చెప్పి, ధర తెలప మన్నది. సుఖధనుడికి మానపర అందాన్ని చూసిన క్షణంలోనే మతి చలించింది. అత నామెతో, "నేను నీకు గుర్రాలను గాని, చీనాంబరాలను గాని అమ్మటం సాధ్యంకాదు. ఒక్క రాత్రి నాతో గడిపి నట్టయితే నువు కోరినట్టు అయిదు వందల

గుర్రాలనూ, అయిదువేల చీనాంబరాలనూ కానుకగా ఇస్తాను," అన్నాడు.

"ఈ మాట నా భర్తతో చెబుతాను," అంటూ మానపర లేచి, తన ఇంటికి వెళ్ళి పోయింది. సుఖధను డన్న మాట విని అర్థ లోభుడు రోషం చెందటానికి మారుగా తన భార్యతో, "అయిదువందల గుర్రాలూ, అయిదువేల వస్త్రాలూ కానుకగా పుచ్చుకుంటున్నప్పుడు సువ్రతనితో ఒక్క రాత్రి గడిపితే తప్పేమిటి? ఈ సాయంకాలం అతని వద్దకు వెళ్ళి రేపు ఉదయం తిరిగిరా," అన్నాడు.




మానపర సుఖధనుడి ఇంటికి వెళ్ళింది. ఆమె తన కోరిక తీర్చటానికి వచ్చిందని తెలియగానే సుఖధనుడు అర్థలోభుడి ఇంటికి అయిదువందల గుర్రాలూ, అయిదువేల చీనాంబరాలూ పంపేశాడు.

ఆ రాత్రి గడిచి తెల్లవారుతూనే అర్థ లోభుడు తన భార్యను సుఖధనుడి ఇంటి నుంచి తీసుకు రమ్మని తన నౌకర్లను పంపాడు.

"నన్ను మీ యుజమాని మరొకరికి భార్యగా అమ్మేశాడు. నేనిప్పుడు మరొకరి భార్యను. మీ యుజమానికి సిగ్గు లేకపోతే నాకు మానాభిమానాలున్నాయి. నేను రానని మీయుజమానితో చెప్పండి," అన్నది మానపర నౌకర్లతో.

నౌకర్లు వచ్చి తన భార్య అన్న మాటలు చెప్పగానే అర్థలోభుడు తన భార్యను బలాత్కారంగా తెచ్చుకోవటానికి నిశ్చయించి, హరబలు డనే మిత్రుడితో సంప్రతించాడు. హరబలుడు అలాటి ప్రయత్నం చెయ్యవద్దని సలహా ఇచ్చాడు.

"భార్య ద్వారా లాభం పొందాలని చూసి నువు పందవయావు. ఆమె కోసం ధనం త్యాగం చేసి అతను శూరుడయాడు. అతని వంటి వాడి కోసం ప్రాణాలర్పించే పరివారం ఉంటుంది, మిత్రులుంటారు. నీ కెవరూ



లేరు. అలాటప్పుడు అతని వద్దనుంచి నీ భార్యను తెచ్చుకోవటం నీకు సాధ్యపడదు," అన్నాడు హరబలుడు అర్థలోభుడితో.

అప్పుడు అర్థలోభుడు రాజు వద్దకు వెళ్ళి, సుఖధను డనే విదేశీవర్తకుడు తన భార్యను అపహరించాడనీ, ఆమెను తనకు తిరిగి అప్పించ వలసిందనీ వేడుకున్నాడు, కాని జరిగినదంతా రాజుతో చెప్పలేదు.

తన కొలువులో ఉన్న అర్థలోభుడికి అన్యాయం జరిగిందనుకుని రాజు సుఖధనుడికి శిక్ష విధించటానికి సిద్ధపడ్డాడు. కాని మంత్రి తొందర పడవద్దన్నాడు: "మహారాజా, సుఖధనుడు దేశాంతరం నుంచి వచ్చిన మేటి వర్తకుడు. అసలు జరిగిన దేమిటో విచారణ జరపకుండా మనం అతన్ని శిక్షించటం అధర్మం," అన్నాడు.

మంత్రి సలహా మీద రాజు సుఖధనుడి బసకు ఒక దూతను పంపి, జరిగిన దేమిటో తెలుసుకు రమ్మన్నాడు. ఆ దూతతో మానసపర జరిగినదంతా చెప్పేసింది. రాజుకు ఆశ్చర్యమయింది. తన కొలువులో ఉండే అర్థలోభుడికి అంత అందమైన భార్య ఉన్నదని రాజు ఎరగడు. ఆమెను చూడాలన్న కోరికతో రాజు, అర్థలోభుణ్ణి వెంట పెట్టుకుని సుఖధనుడి ఇంటికి వెళ్ళాడు.

రాజును చూడగానే మానసపర ఆయన కాళ్ళపైన పడి, జరిగిన సంగతి చెప్పి, "వీరిద్దరిలో నాకు నిజమైన భర్త ఎవరో మీరే సెలవియ్యండి," అన్నది.

రాజు అర్థలోభుడి కేసి చూస్తే, అతనేమీ మాట్లాడలేదు. రాజు మానసపర నిజమే చెప్పినట్టు గ్రహించి, "అమ్మా, నీ మాట నిజమని నేను కూడా ఒప్పుకుంటాను. నీ కోసం అంతులేని త్యాగం చేసినవాడే నీ నిజమైన భర్త," అన్నాడు.

ఈ మాట వినగానే అర్థలోభుడికి అవమానంతో కూడిన ఆగ్రహావేశం వచ్చి,

రాజుతో, "మహారాజా, నేనూ ఈ సుఖ ధనుడూ మా మా పరివారాలతో మానపర కోసం పోరాడతాం. మాలో ఎవరు గెలిస్తే మానపర వాడి భార్య. ఇందుకు మీరు అనుమతించండి," అన్నాడు.

"ఈ భాగ్యానికి పరివారాలు కూడా యుద్ధం చెయ్యటం దేనికి? మనిద్దరమూ యుద్ధం చేసి, ఎవరు జయిస్తే వారికి మానపర భార్య అయేటట్టు నియమం చేసుకుందాం," అన్నాడు సుఖధనుడు.

రాజుగారి అనుమతితో, రాజూ, మానపరా చూస్తూండగా, అర్థలోభుడూ, సుఖధనుడూ చెరొక గుర్రమూ ఎక్కి, అయుధాలు తీసుకుని యుద్ధం ప్రారంభించారు. సుఖధనుడు అర్థలోభుడి గుర్రాన్ని బల్లెంతో పొడిచేసరికి అది అతన్ని పడదోసింది. కింద పడిపోయిన అర్థలోభుణ్ణి చంపక, అతన్ని తిరిగి గుర్రం ఎక్కనిచ్చాడు సుఖధనుడు. ఇలా నాలుగుసార్లు అర్థలోభుడు గుర్రం మీది నుంచి పడిపోయాడు. ప్రతిసారీ సుఖధనుడతనికి గుర్రం పైన ఎక్క అవకాశంతో బాటు ప్రోత్సాహం కూడా ఇస్తూ వచ్చాడు. అర్థలోభుడు అయిదోసారి కింద పడ్డప్పుడు గుర్రంకాలు అతనికి బలంగా తగిలి, స్పృహ తప్పింది. అర్థలోభుణ్ణి అతని నౌకర్లు అవతలికి మోసుకుపోయారు.



రాజు సుఖధనుణ్ణి అభినందించి, తగిన రీతిగా గౌరవించాడు. తరవాత ఆయన అర్థలోభుణ్ణి విచారించి, అతని ఆస్తి అంతా అన్యాయార్జితమని నిశ్చయించి, దాన్ని స్వాధీనపరచుకుని, అతన్ని తన కొలువు నుంచి తొలగించాడు.

బేతాళు డీ కథ చెప్పి, "రాజా, నా కొక్క సందేహం. అర్థలోభుడూ, సుఖధనుడూ యుద్ధం చెయ్యటానికి రాజెందుకు సమ్మతించాడు? మానపర న్యాయంగా సుఖధనుడిదే నని రాజు యుద్ధానికి ముందే ఒప్పుకున్నాడు. ఆ యుద్ధంలో అర్థలోభుడు ఓడిపోవటానికీ, రాజు అతని ధనమంతా కాజేసి, అతన్ని కొలువు నుంచి తొలగించటానికీ సంబంధ మేమీ కానరాదు. అటువంటప్పుడు రాజు వా రిద్దరి ద్వంద్వయుద్ధాని కెందుకు సమ్మతించాడు? ఈ సందేహానికి సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "అర్థలోభుడు డబ్బు దగ్గిర నీచుడని తెలిసి పోయింది. కాని అతను సుఖధనుడితో యుద్ధం చేసి తన భార్యను తిరిగి తీసుకుంటా నన్నప్పుడు, అతనిలో శౌర్య పరాక్రమాలైనా ఉన్నాయేమో చూడటానికి రాజు సమ్మతించాడు. క్షాత్రధర్మం ప్రకారం గెలిచినవాడిదే న్యాయం. యుద్ధంలో అర్థలోభుడు గెలిచి ఉంటే రాజు మానపరను అతనికి ఇప్పించటమే గాక, తన కొలువులో కూడా ఉండనిచ్చేవాడే. కాని అర్థలోభుడిలో వైశ్య ధర్మమూ లేదు, క్షాత్రధర్మమూ లేదు. అతను ఏవిధంగా చూసినా క్షుద్రుడు, సత్వహీనుడు. అలాటి వాడి దగ్గిర కాంతా కనకాలుండరాదు. అందుకే రాజు అతన్ని శిక్షించాడు," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)






# చింతపండు మూట

ఒక గ్రామంలో ఒక వర్తకు డుండేవాడు. అతని కుటుంబం పెద్దదీ, చేసే వ్యాపారం చిన్నదీనూ. అందుచేత అతను సాధ్యమైనంత వరకు చిల్లిగవ్వకూడా వృథాగా ఖర్చు చెయ్యకుండా అమిత జాగ్రత్తగా కాలక్షేపం చేస్తూ ఉండేవాడు.

అతను అప్పుడప్పుడూ బస్తీకి వెళ్ళి, తనకు కావలిసిన సరుకులు కొనుక్కునేవాడు: కాని వాటిని బండి మీద వేయించి, రాజవీధిన తెచ్చేవాడు కాడు. ఎందుకంటే రాజవీధి మీద సుంకాలచావడి ఉన్నది. ఆ వీధిన సరుకు తీసుకుని ఊరు దాటి వెళ్ళేవాళ్ళు అక్కడ సుంకం చెల్లించుకోవాలి. ఆ సుంకం డబ్బులూ, బండి కిరాయి డబ్బులూ అదా అవుతాయి గదా అని, వర్తకుడు బస్తీలో తాను మోయగలిగినంత సరుకు మాత్రమే కొని, గోతం సంచీలో వేసుకుని చుట్టు దారిన అడవి మార్గంగా తన గ్రామానికి మోసుకుపోతూండేవాడు.

అరణ్యమార్గాన దూరం హెచ్చు కావటమే గాక, దారిలో దొంగల భయమూ, క్రూరమృగాల భయమూ కూడా జాస్తి. అరణ్యంలో పిశాచాలుంటాయని కూడా జనం చెప్పుకునేవారు. అయినా వర్తకుడు అన్నిటికీ గుండెరాయి చేసుకుని ఆ దారినే వెళ్ళేవాడు.

ఒకసారి వర్తకుడు ఇలాగే సరుకు మోసుకుని అరణ్య మార్గాన తన గ్రామానికి వస్తుండగా, ఒక మర్రిచెట్టు మీది నుంచి ఒక పిశాచం అతని ముందు గభాల్నదూకి, "నిన్ను మింగేస్తా!" అంటూ మీదికి వచ్చింది.

క్షణంపాటు బెదిరి పోయిన వర్తకుడు వెంటనే ధైర్యం తెచ్చుకుని, "ఓస్, పిశాచానివా? ఇంకా దబ్బనంగా డేమోనని హడలి పోయా!" అన్నాడు.

వి. గంగాధరరావు

ఈ మాట విని పిశాచానికి వల్లమాలిన ఆశ్చర్యం పుట్టు కొచ్చింది. ఈ మనిషికి పిశాచాలంటే భయంలేదు గాని, దబ్బనం గాడంటే భయమా ?

"ఎవడా దబ్బనంగాడు? ఎప్పుడూ వినను కూడా లేదే! వాడు నాకన్న భయంకరుడా? ఎక్కడుంటాడు వాడు?" అన్నది పిశాచం.

"దబ్బనంగాడు సాధారణంగా ఈ అరణ్య ప్రాంతంలో ఉండడులే. అయినా వాడి జోలికి పోమాకు. నువ్వంటే కేవలమూ పిశాచానివి. నా బోటి వాళ్ళను అమాంతంగా మింగెయ్యటమే నీకు చాతనవును. దబ్బనంగా డలాకాదే! వాడు పొడిచి, పొడిచి చిత్రవధ చేస్తాడు. వాడు మహాదుర్మార్గుడు," అన్నాడు వర్తకుడు.

తన ఎదట ఆ వర్తకుడు భయంతో వణికి మూర్ఛపోక పోగా, ఇంకెవరినో దబ్బనంగాణ్ణి గురించి చెప్పి తనను భయపెడుతుంటే పిశాచానికి చాలా కోపం వచ్చింది. "నాకా దబ్బనంగాణ్ణి తక్షణం చూపించు," అన్నది పిశాచం.

"వా డెక్కడో ఊరిమధ్య ఉంటాడు. నిన్ను వాడు చూశాడంటే నిన్నూ నన్నూ కూడా చంపేస్తాడు. అందుచేత నా గోతంలో నిన్ను మూటగట్టి, దబ్బనంగా డుండే చోటికి తీసుకు పోతాను. నువు మాత్రం గోతం



సందుల్లో నుంచి చూస్తూ ఉండు గాని కిక్కురుమనకు," అన్నాడు వర్తకుడు.

అతను తన గోతంలో ఉన్న వస్తువులన్నీ తీసేసి, దయ్యాన్ని అందులో కూర్చోబెట్టి, గోతం మూతి బిగించి కట్టి, భుజాని కెత్తుకుని ఊరి దారి పట్టాడు. అతను రాజ వీధిన సుంకాలచావడి దాటి ఏమీ ఎరగ నట్టు ముందుకు పోతుంటే, "ఏయ్ ఆగు! ఏముందా మూటలో?" అని సుంకాలు వసూలు చేసేవాడు అడిగాడు.

వర్తకుడు మూట దించి, "చింత పండండి," అన్నాడు.

సుంకాధికారి మూటను కాటా వేయిస్తూ దబ్బనంతో నాలుగైదు చోట్ల పొడిచి, "చింతపండు లాగే వుంది. నాలుగు మణుగులు బరువుంది. నాలుగు పావలాలు, ఒక రూపాయి, సుంకం కట్టు," అన్నాడు.

వర్తకుడు రూపాయి చెల్లించి, మూట మళ్ళీ ఎత్తుకుని మరొక దారిన అరణ్యంలో తన సామానున్న చోటికి చేరి, గోతం మూతి విప్పి దయ్యాన్ని విడుదల చేసి, "చూశావా, దబ్బనంగాడి తడాఖా? నేను రూపాయి ఇచ్చాను గనక నువు ప్రాణాలితో బయట పడ్డావు," అన్నాడు.

"అబ్బ, పొడిచి పొడిచి చంపాడు. నువు చింతపండని అబద్ధం చెప్పబట్టి బతికి పోయాను. నీ కేం ఉపకారం కావాలో కోరుకో," అన్నది పిశాచం.

"పెద్ద కుటుంబం గలవాణ్ణి. చాతయితే ధనం ఇప్పించు," అన్నాడు వర్తకుడు.

"దానికేం భాగ్యం? ఈ చెట్టు మొదట్లో చాలా ధనం ఉంది. తవ్వుకో," అంటూ దయ్యం ఎగిరి చెట్టు మీదికి వెళ్ళింది.

వర్తకుడు చెట్టు మొదట తవ్వగా బోలెడంత ధనం దొరికింది. దాన్ని మూటలో వేసుకుని, ఆ అరణ్య మార్గానే తన గ్రామం చేరి, ఆ డబ్బుతో అతను హాయిగా జీవించాడు.







# పెళ్ళికానుక

చాలా ఏళ్ళ క్రితం పాపన్న సకుటుంబంగా తన అత్తవారింటికి నెల రోజులపాటు వెళ్ళ వలసి వచ్చింది. అందుచేత అతను తన ఆవునూ, లేగనూ పొరుగింటి వాళ్ళ పోష ణలో ఉంచి, తరవి కోడెదూడను గొడ్లను కాసే సుబ్బడి వద్ద ఉంచాడు. పాపన్న తిరిగి వచ్చేదాకా ఆ దూడ సుబ్బడి ఇంట్లోనే ఉండి, సుబ్బడి కూతురు మల్లికి బాగా మాలిమి అయింది.

తన దూడను తోలుకు పోవటానికి సుబ్బడింటికి వెళ్ళిన పాపన్న, ఆ దూడ మల్లిని రాచుకు రాచుకు తిరగటమూ, దూడను తీసుకుపోతారు గదా అని మల్లి కన్నీరు కార్చటమూ చూసి, "దూడ మీ ఇంటికి బాగా అలవాటైనట్టుందే?" అన్నాడు సుబ్బడితో.

"మరేం లేదండి. మా మల్లికి దూడంటే ప్రాణమైపోయింది. మల్లి ఏం చెప్పినా దానికి అర్థమవుతుంది. మూగజీవమైతే మాత్రమేం, బలే బుద్ధిగల దూడండి," అన్నాడు సుబ్బడు.

"చూడు, సుబ్బడూ. దూడకు మీ ఇల్లే అనువుగా ఉంటుంది. దాన్ని నువే ఉంచుకో," అన్నాడు పాపన్న.

"బీదవాణ్ణి, దూడ ఖరీదిచ్చుకోలేను, బాబూ. ఇచ్చుకోగలిగితే ఉంచుకోవాలనే ఉంది," అన్నాడు సుబ్బడు.

"నిన్ను ఖరీదెవరడిగార్రా? ఉరికే ఇచ్చాను, తీసుకో. ఇక నుంచీ ఆ దూడ నీదే—నీదీ, మల్లిదీనూ! సరేనా?" అని పాపన్న ఇంటికి వెళ్ళిపోయాడు.

రోజులు గడిచాయి. మల్లికి పెళ్ళీడు వచ్చింది. గిత్త కూడా ఏపుగా పెరిగింది. దాన్ని అమ్మజూపితే ఎవరైనా ఎగరేసుకు పోతారు. అందుచేత గిత్తను అమ్మి కూతురికి పెళ్ళిచేయాలని సుబ్బడు ఆలోచన

చేశాడు. ఈ ఆలోచనను సుబ్బడు పాపన్నకు తెలియజేసి, అతని సలహా అడిగాడు. అలాగే చెయ్యమన్నాడు పాపన్న.

సుబ్బడు గిత్త నమ్ముతున్నట్టు తెలియగానే సోమయ్య అనేవాడు దాన్ని కొనాలని నిశ్చయించాడు. అతనికి పాపన్న తెలుసు. పాపన్నను అడ్డం పెట్టి బేరం చేస్తే చౌకగా దొరుకుతుం దనుకుని, పాపన్న వద్దకు వచ్చి, "పాపన్నా, నువు సుబ్బడి కిచ్చావు చూడూ, ఆ గిత్తను సుబ్బడు అమ్ముతున్నాడని తెలిసింది. కొందా మనుకుంటున్నాను," అన్నాడు సోమయ్య.

"కొనుక్కో. నా అభ్యంతర మేమీ లేదు. అన్ని హక్కులతోనూ నేనా దూడను సుబ్బడి కిచ్చేశాను," అన్నాడు పాపన్న.

"బేరం చెయ్యటానికి నువు కూడా నావెంట రా. అది నాకూ, సుబ్బడికీ కూడా మంచిది," అన్నాడు సోమయ్య. పాపన్న తన వెంట ఉండి గిత్తను కొనిపిస్తుంటే సుబ్బడు పూర్తి ధర అడగలేడని సోమయ్య నమ్మకం. ఆ దూడ ఒకప్పుడు పాపన్నదే గద.

పాపన్న సోమయ్య వెంట వెళ్ళటానికి ఒప్పుకున్నాడు. తానే దగ్గిర ఉండి అమ్మిస్తే సుబ్బడు కూడా తృప్తిపడతాడని పాపన్న అభిప్రాయపడ్డాడు.




ఇద్దరూ కలిసి సుబ్బడి యింటికి వెళ్ళారు. అంతా విని సుబ్బడు పాపన్నతో, "మీరు ఎంత కివ్వమన్నా ఇచ్చేస్తాను?" అన్నాడు.

"మధ్య నేను చెప్పటందేనికి, సుబ్బడూ? ఆ గిత్త నీదే. దాన్ని నువు ఎంత కమ్మదలిచావో చెప్పెయ్యి. ఇష్టమైతే కొంటారు, లేకపోతే మానేస్తారు," అన్నాడు పాపన్న.

"అలా అయితే, గిత్తను నూరురూపాయలకు అమ్మేస్తానండి. నలుగురినీ అడిగి విచారించాను. అది దానికి న్యాయమైన ధరే. కాదంటారా, మీరే ఏదో ధర చెప్పండి. మారు మాట్లాడకుండా ఇచ్చేస్తాను," అన్నాడు సుబ్బడు పాపన్నతో.



సోమయ్య పాపన్నను అవతలికి తీసుకు పోయి, "ధర చాలా చెబుతున్నాడు. యాభై రూపాయల కియ్యమని చెప్పు. నువు చెప్పిన ధర కిస్తానంటున్నాడు గదా?" అన్నాడు.

"వాడి గిత్త. వాడు కోరిన ధరకు వా డమ్ముకుంటాడు. ధర జాస్తి అని తోస్తే కొనకు. అంతేగాని, దాన్ని ఇంత ధరకు అమ్మమని వాడితో నేనెలా అంటాను?" అన్నాడు పాపన్న.

"అయితే నీ వల్ల నాకు ఏం సహాయ మైనట్టు?" అన్నాడు సోమయ్య.

"అదేమో నీకే తెలియాలి. నేను రాక పోతే వాడింకా జాస్తి ధర చెప్పేవాడేమో. వాడు చెప్పిన ధర నీకు అన్యాయమని తోస్తే గిత్తను కొనకు," అన్నాడు పాపన్న.

"నువ్వేదో ఒరగబెడతా వనుకున్నాను. చాల్లే!" అంటూ సోమయ్య కోపంగా వెళ్ళిపోయాడు.

పాపన్న సుబ్బడి దగ్గిరికి తిరిగివచ్చి, "సుబ్బడూ, నువ్వడిగిన ధర సోమయ్యకు నచ్చలేదు. ఒక పని చేద్దాం. నీ గిత్తను నూరు రూపాయలకు నాకే అమ్మి, పిల్ల పెళ్ళి చేసెయ్యి," అన్నాడు.

"ఎంతమాట, బాబూ? మీ గిత్తను మీకే అమ్మటమా? కావాలంటే ఊరికేనే తీసు కోండి. పిల్లదానిపెళ్ళి ఏదో విధంగా అవు తుంది. పెళ్ళికింకా తొందరేమీలేదు లెండి. సంబంధమే చూడలేదింకా. డబ్బు చేత పెట్టుకుని సంబంధం చూద్దామనుకున్నాను. మీరిచ్చిన గిత్తమూలానే పెళ్ళి జరుగుతుం దని నా నమ్మకం," అన్నాడు సుబ్బడు.

వాళ్ళిద్దరూ మాట్లాడుకుంటుండగా రామయ్య అనే అతను అటుగా వచ్చి, "ఏమిటి సంగతి?" అని అడిగాడు. పాపన్న అంతా చెప్పాడు. రామయ్య గిత్తను చూసి, "నూరు రూపాయలు చెయ్యగల గిత్తే. మరొక రెందుకు? దీన్ని నేనే కొంటాను. ఇదుగో, ప్రస్తుతం నా దగ్గిర ఉన్న ఈ పది

రూపాయలూ బయానా కింద ఉంచు. మిగ తాది రేపు తెచ్చిఇచ్చి గిత్తను తోలుకు పోతాను," అంటూ సుబ్బడి చేతిలో పది రూపాయలు పెట్టాడు.

సుబ్బడి గిత్తకు బేరం కుదిరిందని సోమయ్యకు తెలియ వచ్చింది. మర్నాడు అతను నూరు రూపాయలూ తీసుకుని సుబ్బడి యింటికి వచ్చి, "ఇదుగో, నిన్న మనం అనుకున్న మాట ప్రకారం నూరు రూపాయలూ తీసుకువచ్చాను. గిత్తను ఇచ్చెయ్యి," అన్నాడు.

సుబ్బడు అతనితో, "తమకు ధర నచ్చ లేదని నిన్న పాపన్నగారు నాతో అన్నారు. అందుచేత గిత్తను రామయ్యగారికి అమ్మ టానికి ఒప్పుకుని పదిరూపాయలు బయానా కూడా పుచ్చుకున్నాను," అన్నాడు.

"అదేంమాట? ఒక చెంప బేరం నలుగు తూండగానే గిత్తను నువు రామయ్య కెలా అమ్మావు? ఇది పరువైన పనేనా? నువు ధర చెప్పగానే సరేనని నీ దోసిట్లో డబ్బు పోస్తే బేరానికి ఒప్పుకున్నట్టూ, లేకపోతే నేను బేరం మానుకున్నట్టూనా? నాకు నీ గిత్త అక్కర్లేదని నీతో చెప్పానా?" అని సోమయ్య చిందులు తొక్కాడు.

"నాకు మాత్రం ఏం తెలుసు, బాబూ? మీరూ పాపన్నగారూ అవతలికి వెళ్ళి ఏదో







"నన్ను తిట్టి వెళ్ళి పోయావు. ఆలోచిస్తు న్నట్టు మాట మాత్రం చెప్పలేదు. బేరం నలుగుతున్నదని నేనెలా అనుకోను? కొనే వాడి లాగా ప్రవర్తించినవాడు రామయ్య; గిత్తను చూశాడు, ధర తెలుసుకున్నాడు. దగ్గిర ఉన్నది బయానా ఇచ్చాడు. అటు వంటి వాడి కోసం పది రోజు లాగమన్నా అర్థం ఉంది. నీ బేరమంటిది నే నెక్కడా చూడలేదు. ధర జాస్తి అన్నవాడివి మరొక మాట చెప్పకపోతివి. ఆ ధరకే తీసుకోవ టానికి ఇవాళ సిద్ధమైన వాడివి, మళ్ళి వస్తా నని నిన్న మాట మాత్రం అనకపోతివి," అన్నాడు పాపన్న.

"సరే, అది నా తప్పే. బేరం ఇంకా పూర్తికాలేదుగా. ఇంకో పది రూపాయలు జాస్తి ఇస్తాను. గిత్తను నాకే ఖరారు చేయించు," అన్నాడు సోమయ్య పాపన్నతో.

రామయ్య మండిపడ్డాడు. అతను పాపన్నతో, "పాపన్నా, ఇదా నువ్వాడే నాటకం? మా ఇద్దరికీ మధ్య పాటపెట్టి ఇద్దరినీ క్షవరం చేస్తావా?" అన్నాడు.

"అదా సంగతి?" అన్నాడు సోమయ్య.

"బాబూ, నా గిత్తను మీలో ఎవరికీ అమ్మను. రామయ్యా, బాబుగారూ? నిష్కారణంగా పాపన్నగారి మీద నింద ఎందుకు

మాట్లాడుకున్నారు. మీరటునుంచి అటే వెళ్ళి పోయారు. పాపన్నగారు తిరిగి వచ్చి, మీకు ధర నచ్చలేదని చెప్పారు. మీకు ధర నచ్చుతుందనీ, కొంటానని మళ్ళి వస్తారనీ నేను కలగంటానా? మీరే చెప్పండి?" అన్నాడు సుబ్బడు.

"ఏడీ, ఆ పాపన్న?" అని సోమయ్య అంటుండగానే రామయ్య పాపన్నను వెంట బెట్టుకుని రానే వచ్చాడు.

"నేను గిత్త బేరం వదులుకున్నట్టు సుబ్బడితో చెప్పావుట? ఇదుగో, సొమ్ము తెచ్చాను. గిత్తను నాకు ఇప్పించు," అన్నాడు సోమయ్య పాపన్నతో.

వేస్తారు? మీరిచ్చిన పది రూపాయలూ మీరు పుచ్చుకుని, మీదారిన మీరు వెళ్ళండి," అంటూ ఇంట్లో నుంచి పది రూపాయలూ తెచ్చి రామయ్య కిచ్చేశాడు.

సోమయ్యా, రామయ్యా పాపన్నను కొర కొరా చూసి వెళ్ళి పోయారు.

అంతలోనే మల్లి అడావుడిగా వచ్చి, "నాన్నా, నాన్నా! ఎవరో అబ్బాయి పరి గెత్తుకుంటూ వచ్చి మన గొడ్ల పాకలో దూరాడు. ఎవరైనా వచ్చి అడిగితే చెప్ప వద్దని బతిమాలాడు," అన్నది.

మరుక్షణమే ఒక మనిషి వచ్చి, పాపన్నను చూసి, "ఏమండీ, ఇటుగా మావాడుగాని వచ్చాడా? మీరేమన్నా చూశారా?" అని అడిగాడు.

"వాడేం చేశాడు? ఎందుకు పారి పోయాడు?" అన్నాడు పాపన్న.

"నా కొడుకండీ. వట్టిచవట. ఇంటినుంచి ఎవరికీ తెలియకుండా డబ్బు తీసుకుని బయలుదేరాడు. వాణ్ణి తరుము కుంటూ వస్తున్నాను," అన్నాడా మనిషి.

ఇంతలోనే సుబ్బుడు గొడ్లపాక లోకి పోయి, ఒక కుర్రాణ్ణి చెయ్యిపట్టుకుని తీసుకొచ్చాడు.

వాడి పేరు మారన్న. వాడి తండ్రి కూలి చేసుకుని బతికే మనిషి. మారన్న ఏ పనీ



చెయ్యక జులాయిగా తిరుగుతాడు. దమ్మిడీ సంపాదించలేని వెధవకు పెళ్ళిమీద మనసు పోయింది. పెళ్ళి చేసినా, తన పొట్టే పోసుకోలేని వాడు పెళ్ళాన్ని కూడా ఎలా పోషిస్తాడు? అందుకని తండ్రి వాణ్ణి నానా తిట్లూ తిట్టి, అవమానించాడు. వాడికి అభిమానం వచ్చి, "నేనూ సంపాదించగలను డబ్బు. ఈ నాటినుంచీ నన్ను నువ్వేమీ పోషించనవసరం లేదు," అని తండ్రి దగ్గిర బీరాలు పలికి, ఇంట్లో దాచి ఉంచుకున్న కొద్ది డబ్బూ దొంగిలించి, ఇంటి నుంచి పారిపోయి వచ్చాడు.

పాపన్న మారన్నను పరీక్షగా చూశాడు. కుర్రాడు బాగానే వున్నాడు. పౌరుషం గల వాడే. పరువుగా బతికే అవకాశం దొరికితే బాగుపడవచ్చు.

పాపన్న సుబ్బణ్ణి అవతలికి తీసుకుపోయి, "వీడికి నీ కూతుర్ని ఇచ్చి చేస్తే ఎలా ఉంటుందంటావు?" అన్నాడు.

"వాడు పెళ్ళాన్ని ఎలా పోషిస్తాడండీ?" అన్నాడు సుబ్బడు.

"దానికో ఉపాయం చేద్దాం. పెళ్ళి కానుకగా నే నొక ఒంటెద్దు బండి చేయించి ఇస్తాను. గిత్త ఉండనే ఉన్నది. బండి తోలుకుని వాడు నాలుగు డబ్బులు స్వతంత్రంగా సంపాదించుకుంటాడు. అదే వాడికి నువ్విచ్చే వరదక్షిణ అనుకో. పెళ్ళికి పైఖర్చు కింద పదో, పరకో కావాలంటే నేనే సర్దుతాను," అన్నాడు పాపన్న.

సుబ్బడికి ఈ ఆలోచన చాలా బాగున్నట్టు తోచింది. మారన్న తండ్రికి కూడా, తన కొడుకు ఒడ్డెక్కటాని కింతకన్న మంచి మార్గం ఉండ దనిపించింది. మారన్నకూ, మల్లికీ పెళ్ళి జరిగింది. పాపన్న వధువుకు బండి చదివించాడు. మారన్న బండి తోలటం నేర్చుకున్నాడు.

తాను పెంచి పెద్దచేసిన గిత్త తన వెంటే ఉన్నందుకు మల్లి మహాసంతోషించింది.





# నిశ్చయదత్తుడి కథ

ఉజ్జయినీ నగరంలో నిశ్చయదత్తు డనే వైశ్య యువకు డుండేవాడు. అతను జూదంలో ఆరితేరినవాడు; జూదంలో డబ్బు గెలిచి, బ్రాహ్మణులకూ, బీదసాదలకూ, అనాథులకూ దానాలు చేసేవాడు. అతను రోజూ సిప్రానదికి వెళ్ళి, అందులో స్నానం చేసి, మహాకాలుడి ఆలయానికి వెళ్ళి పూజ చేసి, ఆ పక్కనే ఉన్న శ్మశానంలోకి వెళ్ళి, ఒంటికంతకూ గంధపు పూత పూసుకుని, అక్కడ వున్న రాతి స్తంభానికి ఇంత గంధం పట్టించి, దానికి తన వీపు రుద్దుకునేవాడు.

ఒకనాడు ఎవరో శిల్పి ఆ శ్మశానం మీదుగా పోతూ, ఆ రాతి స్తంభం మీద కొంత భాగం నునుపెక్కి ఉండటం చూసి, ఆ భాగాన గౌరీ విగ్రహాన్ని చెక్కి తన దారిన తాను వెళ్ళాడు. తరవాత కాస్సేపటికి ఒక విద్యాధరి మహాకాలుణ్ణి ఆరాధించటానికి అక్కడికి వచ్చి, స్తంభం మీద చెక్కి ఉన్న గౌరీ విగ్రహాన్ని చూసి, అందులో గౌరీ ఉంటుందనుకుని, తాను కూడా అదృశ్యంగా ఆ స్తంభంలో ప్రవేశించి విశ్రాంతి తీసుకోసాగింది.

ఇంతలో నిశ్చయదత్తుడు తన దినచర్య అంతా పూర్తి చేసుకుని, వీపుకు గంధం పట్టించుకోవటానికి స్తంభం దగ్గిరికి వచ్చి, తాను రోజూ గంధం అంటించే చోట గౌరీ బొమ్మ చెక్కి ఉండటం చూసి చాలా ఆశ్చర్యపడి, ఆ స్తంభానికి మరొక పక్కన గంధం పట్టించి, దానికి తన వీపు వేసి రుద్దుకోసాగాడు.

స్తంభంలో విశ్రాంతి తీసుకుంటున్న విద్యాధరి ఇది చూసి, "ఇంత అందమైన యువకుడు! ఇతని వీపుకు గంధం పూసే వాళ్ళు కూడా లేరా, పాపం?" అనుకుని, తన చెయ్యి స్తంభంలో నుంచి బయటికి చాచి, అతని వీపున గంధం రాయ నారం



ఖించింది. ఆమె చేతి స్పర్శకూ, చేతిగాజుల గలగలకూ ఒళ్ళు పులకరించి, నిశ్చయదత్తుడు చప్పున ఆమె చేతిని గట్టిగా పట్టుకున్నాడు.

"అయ్యో, నేను నీ కేం ద్రోహం చేశాను? నా చెయ్యి విడిచిపెట్టు," అన్నది విద్యాధరి స్తంభంలో నుంచి.

" నా ఎదట ప్రత్యక్షమై, నువు ఎవతెవో చెబితే గాని నీ చెయ్యి వదలను," అన్నాడు నిశ్చయదత్తుడు.

విద్యాధరి స్తంభంలో నుంచి బయటికి వచ్చి, అతని కెదురుగా కూర్చుని తన వృత్తాంతం ఇలా చెప్పింది:

ఒక హిమాలయ శిఖరాన పుష్కరావతి అనే నగరానికి వింధ్యపరు డనే విద్యాధర రాజున్నాడు. ఈమె అతని కూతురు. పేరు అనురాగపర. ఆమె మహాకాలుణ్ణి అర్చించ టాని కని వచ్చి, ఈ స్తంభలో విశ్రాంతి తీసుకుంటూ, నిశ్చయదత్తుణ్ణి చూడగానే అతన్ని ప్రేమించింది. అందుకే ఆమె అతని వీపుకు గంధం పూసింది.

ఆమె ఈ మాట చెప్పి, ఇక వెళ్ళివస్తా నన్నది నిశ్చయదత్తుడితో.

"దుర్మార్గురాలా, ఏమి టా మాటలు? నా హృదయం అపహరించి, దాన్ని నాకు తిరిగి ఇవ్వకుండా, ఎలా వెళ్ళిపోతావు?" అన్నాడు నిశ్చయదత్తుడు.

" నువు మా నగరానికి వచ్చినట్టయితే నీకు భార్య నవుతాను. నీకు అక్కడికి రావాలన్న పట్టుదలే వుండాలి గాని, దారి తెలియకపోదు," అంటూ ఆమె ఆకాశం లోకి ఎగిరి, అతని కేసి ప్రేమగా చూస్తూ వెళ్ళిపోయింది.

అనురాగపరను మరిచిపోవటం సాధ్యం కాదనీ, ఎంత దుస్సాధ్యమైనా తాను పుష్కరావతీ నగరానికి పోవలసిందేననీ, ఈ ప్రయత్నం చెయ్యకుండా ఉండేకన్న ప్రయత్నంలో మరణించినా మేలేననీ,

నిశ్చయదత్తుడు నిశ్చయించుకుని, ఆ రోజే ఉత్తర దిక్కుగా హిమాలయాని కేసి బయలుదేరాడు.

దారిలో అతనికి మరిముగ్గురు వైశ్య యువకులు తారసిల్లారు. వాళ్ళు కూడా ఉత్తర దిక్కుగానే వెళుతూండటంచేత నలుగురూ కలిసే ప్రయాణం చేశారు. వారు కొంత దూరం వెళ్ళాక తాజికు లనే జాతి వాళ్ళుండే దేశం వచ్చింది. అక్కడ కొందరు తాజికులు ఈ నలుగురినీ పట్టుకుని, ధనవంతు డైన ఒక తాజికుకు వాళ్ళను అమ్మేశారు.

ఆ ధనికుడు తన మనుషుల వెంట ఆ నలుగురు బానిసలనూ తమ రాజుండే చోటికి నజరానాగా పంపాడు.

వాళ్ళందరూ తాజికురాజధాని చేరే సమయానికే అక్కడుండే రాజు చనిపోవటం తటస్థించింది. అందుచేత తాజికు ధనికుడి మనుషులు చనిపోయిన రాజుకొడుకుతో, "మా యజమాని ఈ బానిసలను తమ తండ్రిగారి కోసం కొని నజరు పంపారు. అందుచేత వీరిని మీరే స్వీకరించండి," అని చెప్పి, నిశ్చయదత్తుణ్ణీ, అతని ముగ్గురు సహచరులనూ చనిపోయినవాడి కొడుకు పరంచేశారు.



"మా తండ్రిని పాతిపెట్టేటప్పుడు ఆయన కళేబరంతో బాటు ఈ నలుగురినీ సమాధి చేద్దాం. ఈ రాత్రికి వీరిని కట్టి, ఖైదులో ఉంచండి," అన్నాడు రాజుకొడుకు తన భటులతో.

భటులు ఆ నలుగురినీ బంధించి, ఒక గుడిసెలో ఉంచారు. తన వెంట ఉన్న ముగ్గురూ మరణభయంతో తల్లడిల్లి పోతూ ఉండటం చూసి నిశ్చయదత్తుడు, "భయపడి వణకటం చేత ఆపదలు తప్పుతాయా? చావవలసి వచ్చినా ధైర్యంగా చావండి. లేదా, అందరినీ కాపాడే ఆ మహాదుర్గను భక్తితో ధ్యానించండి," అంటూ తాను మహా



దేవిని ధ్యానించి పడుకుని నిశ్చింతగా నిద్రపోయాడు.

అతనికి కలలో దేవి కనిపించి, "నాయనలారా, ఇక నిద్రలేవండి. మీ బంధాలు విడిపించాను. తప్పించుకుని పారిపొండి," అని చెప్పింది.

నలుగురూ ఈ మాటలు విని ఒక్కసారిగా లేచి కూర్చుని, తమ కట్లు నిజంగానే ఊడి ఉండటం చూసి పరమానందం చెందారు. ఇంకా కొంత రాత్రి ఉన్నది. వాళ్ళు ఆ చీకటిలో తామున్న గుడిసె నుండి బయలుదేరి తెల్లవారు జాముకు చాలా దూరం వెళ్ళారు.

నిశ్చయదత్తుడు ఇంకా ఉత్తరానికే ప్రయాణం చేస్తున్నాడు. కాని అతని అనుచరులు, "ఇటు పోయిన కొద్దీ మ్లేచ్ఛుల వల్ల ప్రమాదం జాస్తి. ఇప్పటికే ఒక గండం గడిచింది. మేము దక్షిణంగా తిరిగి వెళ్ళి పోతాము," అన్నారు.

"సరే, మీ ఇష్టం," అని వారి వద్ద సెలవు పుచ్చుకుని, నిశ్చయదత్తుడు మాత్రం అనురాగపరను చేరటమే తన లక్ష్యంగా పెట్టుకుని, ఉత్తరానికి నడక సాగించాడు.

వితస్తానదీ తీరాన్ని చేరే సరికి అతనికి నలుగురు శాక్తేయులు తటస్థపడ్డారు. అందరూ కలిసి వితస్తానదిని దాటి, సూర్యాస్తమయం వేళ భోజనాలు చేసుకుని, ముందుకు సాగి, ఒక అరణ్యం ప్రవేశించారు.

ఆ సమయంలో కొందరు కట్టెలు కొట్టే వాళ్ళు అరణ్యంలో నుంచి తిరిగి వస్తూ ఎదురుపడి, "ఎక్కడికిలా పోతున్నారు? చీకటిపడబోతున్నది. దరిదాపుల్లో మీకు గ్రామమేమీ తగలదు. ఈ అరణ్యంలో ఒక పాడుపడిన శివాలయం మాత్రం ఉన్నది. కాని ఈ రాత్రి మీరు అందులో కూడా గడపలేరు. ఎందుచేతనంటే, ఈ అరణ్యంలో శృంగోత్పాదిని అనే యక్షిణి

ఒకతె ఉన్నది. అది కనిపించిన మనిషికెల్లా కొమ్ములు మొలిపించి, పశువునుగా మార్చి, తినేస్తుంది," అని చెప్పారు.

అయితే శాక్తేయులు ఈ హెచ్చరికను లక్ష్యపెట్టక, నిశ్చయదత్తుడితో, "మనం ఎప్పుడూ శ్మశానాలలోనే ఉంటూ ఉంటాం. ఇలాటి యక్షిణీలను ఎన్నింటినో చూశాం. ఈ పాడు యక్షిణీకి మనం భయపడం," అని శివాలయానికి దారి తీశారు. నిశ్చయదత్తుడు అభ్యంతరం చెప్పక వారితో పాటు వెళ్ళాడు.

శివాలయంలో శాక్తేయులు బూడిదతో పెద్ద మండలం తయారు చేసి, అందులో ప్రవేశించి దాని మధ్య పెద్ద అగ్ని రగిల్చి, అందులో ఎండుపుల్లలు వేస్తూ మంత్రాలు చదవసాగారు.

కొంత రాత్రి గడిచేసరికి కంకాళకిన్నరి వాయిస్తూ, శృంగోత్పాదిని అనే యక్షిణి అక్కడికి రానే వచ్చింది. అది మండలానికి ఎడంగానే ఉండి, నృత్యం చేస్తూ ఒక శాక్తేయుడి కేసి తీక్ష్ణంగా చూస్తూ, కొమ్ములు మొలిపించే మంత్రం చదివింది. దాని ఫలితంగా ఆ శాక్తేయుడి నెత్తిన కొమ్ములు మొలుచుకొచ్చాయి.

శాక్తేయుడు లేచి పారవశ్యంతో పాటలు పాడుతూ, నృత్యం చేస్తూ, వెళ్ళి అగ్నిలో



పడిపోయాడు. యక్షిణి వాణ్ణి నిప్పుల్లో నుంచి లాగి తినేసింది.

ఇదేవిధంగా యక్షిణి ఒకరి తరవాత ఒకరుగా మిగిలిన ముగ్గురు శాక్తేయులకూ కొమ్ములు మొలిపించి, వారు నృత్యం చేస్తూ నిప్పులో పడి కాలినాక, వారిని తీసుకుని తిన్నది. ఒక్కసారిగా నలుగురిని తిన్నదేమో, యక్షిణికి కొంచెం మైకం లాంటిది వచ్చి, అది తన కంకాళకిన్నరిని క్షణం పాటు నేల మీద పెట్టింది.

మరుక్షణమే నిశ్చయదత్తుడు ఒక్క దూకున యక్షిణి వద్దకు వచ్చి ఆ కంకాళ కిన్నరిని తీసుకున్నాడు. కొమ్ములు మొలిపించే మంత్రం నాలుగుసార్లు విని ఉండటంచేత అతని కది కంఠస్థమయింది. అతను యక్షిణి కేసి తదేకదృష్టితో చూస్తూ, ఆ మంత్రాన్ని పఠించసాగాడు.

యక్షిణి నెత్తిన కొమ్ములు మొలవసాగాయి. అది బెదిరిపోయి, నిశ్చయదత్తుడి కాళ్ళ మీద పడి, "మహానుభావా! మంత్రం చదవకు. ఆడదాన్ని. కనికరించు. రక్షించు. నేను నీ కేం కావాలంటే అది చేసిపెడతాను. నిన్ను అనురాగపర ఉండే చోటికి చేర్చమన్నా చేర్చుతాను," అన్నది.

యక్షిణి అన్న ఆఖరు మాట వింటూనే నిశ్చయదత్తుడు మంత్ర పఠనం మానేసి, మంత్రాన్ని ఉపసంహరించాడు.

యక్షిణి అతన్ని తన వీపున ఎక్కించుకుని, ఆకాశానికి ఎగిరి తెల్లవారే లోపల అతన్ని పుష్కరావతికి చేర్చింది.

అనురాగపర తన ప్రియుడు వస్తున్న సంగతి దివ్యశక్తుల సహాయంతో ముందుగానే తెలుసుకుని, తండ్రి ఇంటి నుంచి బయలుదేరి అతనికి ఎదురు వచ్చి, ఇంటికి తీసుకుపోయింది.

తరవాత అనురాగపరను పెళ్ళాడి నిశ్చయదత్తుడు పుష్కరావతీ నగరంలోనే ఉండిపోయాడు.






# కోతిపనులు

ఒక గ్రామంలో ఒక ముసలివా డుండేవాడు. ఒకనాడు వాడు తన భార్య ఇచ్చిన అటుకులు మూట కట్టుకుని, కొండ మీద గడ్డి కోయబోయాడు. అక్కడ వాడు తన అటుకుల మూటను ఒక చెట్టుకొమ్మకు వేళ్ళాడగట్టి, గడ్డి కోయ నారంభించాడు. వాడు కొంతసేపు గడ్డి కోసి, అలుపు తీరటానికి కూర్చుని ఉండగా ఎక్కడి నుంచో కోతులు మందగా వచ్చి, చెట్టుకొమ్మన వేళ్ళాడే మూట నుంచి అటుకులు తీసుకుని తినేశాయి.

ముసలివాడు ఇదంతా చూస్తూ, మాటా పలుకూ లేకుండా, కదలక మెదలక కూర్చున్నాడు. కోతులు వాణ్ణి చూసి ఏదో విగ్రహమనుకుని, కొంతసేపు కిచకిచలాడాయి. తరవాత కూడబలుక్కున్నట్టుగా అవి అన్నీ ముసలివాడి వద్దకు వచ్చి, వాణ్ణి ఎత్తుకుని, కొంత దూరంలో ఉండే పాడుబడిన గుడికి తీసుకుపోయి, దాని మెట్ల మీద కూర్చోబెట్టాయి.

తరవాత అవి వెళ్ళిపోయి కొంతసేపటికి గుప్పిళ్ళతో డబ్బులు తెచ్చి ముసలివాడి ముందు వెదజల్లి, తమ దారిన తాము వెళ్ళిపోయాయి.

అంతసేపూ ముసలివాడు కళ్ళు మూసుకుని కదలకుండా కూర్చున్నాడు. ఆ గుడిలో ఉండే విగ్రహానికి దారే పొయ్యేవాళ్ళు చిల్లరడబ్బులు వెయ్యటం ఆ కోతులు చూసి ఉండాలి. ఆ డబ్బులను అవి తీసుకుపోయి, ఎక్కడో భద్రంగా దాచి, వాటిని ముసలివాడికి ఇచ్చేశాయి.

కోతులు వెళ్ళిపోయాక ముసలివాడు కోతిబుద్ధులను చూసి నవ్వుకున్నాడు. ఏమైనా ఆ రోజు తన అదృష్టం బాగుందనుకుని, వాడు ఆ డబ్బులన్నీ జాగ్రత్తగా ఏరుకుని, దారిలో తనకూ తన భార్యకూ

* ఎస్. వెంకట్రామయ్య

కొత్తబట్టలు కొని, ఇంటికి వెళ్ళి, మిగిలిన డబ్బు భార్యకిచ్చి, చక్కగా పిండివంట చేయించుకు తిన్నాడు.

వాళ్ళు భోజనం చేస్తుండగా పొరుగునున్న ముసలమ్మ వచ్చి, "ఏమిటి విశేషం? ఇద్దరూ కొత్తబట్టలు కట్టుకుని పండగ చేసుకుంటున్నారు!" అని ఆశ్చర్యపడుతూ అడిగింది.

ముసలివాడి భార్య ఆ ముసలిదానికి కూడా పిండివంటలు పెట్టి, కోతులకథ అంతా చెప్పింది.

ఆ ముసలిది అంతా విని, ఆదరాబాదరా ఇంటికి వెళ్ళి, తన మొగుడితో కోతుల సమాచారం చెప్పి, "నువు కూడా వెళ్ళి కోతు లిచ్చే డబ్బులు తేరాదూ?" అన్నది. ముసలిదాని భర్త సరే నన్నాడు.

మర్నాడు ముసలిది తన మొగుడికి అటుకులు మూటకట్టి ఇచ్చింది. వాడా మూటను తీసుకుని బీడు మీదికి వెళ్ళి, అటుకుల మూటను ఒక చెట్టుకొమ్మకు తగిలించి, బీడు మధ్య నిశ్చలంగా విగ్రహం లాగా కూర్చున్నాడు.

కొంత సేపటికి కోతులు వచ్చాయి. అటుకులు తినేశాయి. విగ్రహం లాగా కూర్చుని ఉన్న ముసలిదాని మొగుణ్ణి సమీపించి ఎత్తుకుని పోసాగాయి.

ముసలిదాని మొగుడికి వాటి చేష్టలకు నవ్వొచ్చింది. వాడు పకపకా నవ్వటమే గాక, కళ్ళు తెరిచి చూశాడు. అది చూసి కోతులకు పట్టరాని కోపం వచ్చింది. అవి వాణ్ణి కింద పారేసి, నెత్తిన చాలాసార్లు మొట్టి, జుట్టు బాగా పీకి, ఒళ్ళు రక్కి, గెంతుతూ వెళ్ళిపోయాయి.

చావు తప్పి కన్ను లొట్ట బోయినంత పని అయి, కాళ్ళీడ్చుకుంటూ తన భర్త ఇంటికి చేరేసరికి ముసలిది తమ పాత బట్టలన్నీ తగలబెట్టేసి, తన భర్త కొత్తబట్టలు కొనుక్కొస్తాడని ఎదురు చూస్తున్నది!





# శంఖధ్వని

ఆరావళీ పర్వత ప్రాంతంలో శంఖచూడ మనే అందమైన సంస్థానం ఉండేది. దాన్ని రాజపుత్ర వంశపు రాజులు పాలించేవారు. అక్కడి కోట బురుజు మీద చిన్న శివాలయమూ, అందులో శివలింగానికి ఎదురుగా ఒక పెద్ద శంఖమూ ఉండేవి. ఆ శంఖం సంస్థానాధిపతి ఊదితేనే మోగేదనీ, దానికి వారసులు గానివారు ఎంత ప్రయత్నించినా దాని నుంచి ఎలాటి ధ్వనీ వచ్చేది కాదనీ ఒక ప్రతీతి ఉండేది.

ఉత్తరదేశంలో హిందువులకూ, ముసల్మానులకూ యుద్ధాలు జరుగుతున్న కాలంలో శంఖచూడ సంస్థానాధిపతి అయిన రణసింహుడు రాజపుత్ర వీరులతో చేరి తాను కూడా యుద్ధం చేయ నిశ్చయించాడు. అతను తన తమ్ముడైన కృపాణసింహుణ్ణి కూడా వెంట తీసుకుని బయలుదేరాడు. వారి సైన్యాలు కోట గోడల వెలపల ప్రయాణానికి సిద్ధంగా ఉన్నాయి. అన్నదమ్ముల అశ్వాలు కోట ద్వారం వద్ద ఆయత్తంగా ఉన్నాయి. ఆ సమయంలో రణసింహుడు తన తమ్ముణ్ణి వెంట బెట్టుకుని, మెట్లెక్కి కోట బురుజుమీదికి వెళ్ళాడు; శివాలయంలో శివలింగం ముందు మోకరించి నమస్కారం చేశాడు; లేచి నిలబడి శంఖాన్ని ఎత్తి పూరించాడు. శంఖం నుంచి అద్భుతమైన ధ్వని బయలుదేరి, గాలిలో నాలుగు వైపులకూ ప్రసరించి, సంస్థానంలో ఉన్న ప్రతి ప్రాణికీ వినిపించి, పులకరింతలు రేపింది.

రణసింహుడు శంఖం ఊదటం చాలించి, దాన్ని యథాస్థానంలో ఉంచుతూ తన తమ్ముడైన కృపాణసింహుడితో, "తమ్ముడూ, నేను యుద్ధంలో చనిపోవటం జరిగినట్టయితే నువు ఇక్కడికి తిరిగి వచ్చి, ఈ శంఖాన్ని పూరించి ఊది, ఈ రాజ్యాన్ని యథేచ్ఛగా ఏలుకో," అన్నాడు.

జి. సోమయాజిశర్మ



కృపాణసింహుడు చుట్టూ కలయ జూశాడు. ఆ కోట బురుజుపై నుంచి చూస్తే అనేక ఆమడల దూరం స్పష్టంగా కనిపిస్తుంది. కనుచూపు మేరవరకూ చక్కని కొండలూ, లోయలూ, అందమైన అడవులూ, చిన్నచిన్న సరస్సులూ—అంత అందమైన ప్రదేశం భూమిపైన ఎక్కడా ఉండదనిపించింది కృపాణసింహుడికి.

అన్నదమ్ములిద్దరూ బురుజు దిగివచ్చి, గుర్రాలనెక్కి, తమ బలాలతో, ఉదయపుర మార్గంపట్టి బయలుదేరారు.

కృపాణసింహుడు ముసల్మానులతో జరగబోయే యుద్ధం గురించి ఆలోచించడం లేదు, శంఖచూడానికి తానే అధిపతి అయితే ఎంత బాగుంటుందా అని ఆలోచిస్తున్నాడు. అందుకు ఒకటే అడ్డం—తన అన్న ప్రాణం. రణసింహుడు మహాశూరుడు. అతను యుద్ధరంగం నుంచి ప్రాణాలతో పారిపోయి రాడు. ముసల్మాను సేనల బలం జాస్తిగా ఉన్న పక్షంలో అతను చచ్చే మాటే నిజం. కాని కృపాణసింహుడికి తన అన్న చావు రూఢి చేసుకోవాలని ఉన్నది. అతనికి ముసల్మానులతో పోరాడాలని లేదు; అన్న రమ్మంటే విధిలేక బయలుదేరాడు. అన్న ఏ క్షణాన చచ్చిపోతే ఆ క్షణాన తాను తన రాజ్యానికి తిరిగి వచ్చి, పట్టం కట్టుకోవచ్చు. తన అన్న చావాలంటే అదొక పెద్దపని ఏమీ కాదు, ఏ రాత్రిపూటనో తానే చంపెయ్యవచ్చు. కాని అందువల్ల తాను అనుమానానికి గురి అయి తీరుతాడు. డబ్బు ఆశ చూపితే ఆ పని చేసిపెట్టే హీనులు సామాన్య సైనికులలో ఉండకపోరు.

అలాటివాళ్ళు ముగ్గురు కృపాణసింహుడికి తన సైనికులలోనే దొరికారు. అతను వాళ్ళకు డబ్బిచ్చి, తన అన్నను మంచి అవకాశం చూసి చంపమనీ, అతని శవాన్ని మాయం చెయ్యమనీ ఆజ్ఞాపించాడు. తరవాత కొద్ది రోజులకు రాజపుత్ర సేనలు

యమునానదీ ప్రాంతాల శిబిరం వేసి ఉన్న సమయంలో ఒకనాటి రాత్రి హంతకులు కృపాణసింహుడి వద్దకు వచ్చి, తమ పని పూర్తిచేశామని చెప్పారు.

"రాజావారు గుడారంలో నిద్రపోతుండగా ఆయనను పాడిచేసి, కళేబరాన్ని తీసుకుపోయి యమునానదిలో గిరవాటు వేశాం," అని వాళ్ళు కృపాణసింహుడికి తెలియజేశారు. కృపాణసింహుడు వాళ్ళకు మరి కొంత డబ్బిచ్చి పంపేశాడు.

మర్నాడు రణసింహుణ్ణి గురించి శిబిరంలో ఆందోళన బయలుదేరింది. ఆయన తన డేరాలో లేడు. ఆయన పడుకున్న పక్క అంతా నెత్తురుమయం. రణసింహుడు హత్య అయినట్టు అందరికీ తెలిసిపోగానే కృపాణసింహుడు చాలా ఆందోళన పడుతున్నట్టు నటిస్తూ సేనాపతుల వద్దకు వెళ్ళి, "నేను మా సేనలతో మా సంస్థానానికి తిరిగి వెళ్ళిపోవటానికి అనుమతి ఇవ్వండి. లేకపోతే అరాజక పరిస్థితి ఏర్పడుతుంది," అని చెప్పి వారి అనుమతితో, తన సైనికులను వెంటబెట్టుకుని శంఖ చూడానికి తిరిగివచ్చాడు.

రణసింహుడు పోయాడన్న వార్త విని దేశవాసులు చాలా విచారించారు. "మా అన్న ఆదేశానుసారం నేనే రాజ్యాభిషేకం







చేసుకుంటాను," అని తన పరివారానికి చెప్పి, కృపాణసింహుడు తన అన్నకు శాస్త్రోక్తంగా ఉత్తర క్రియలు జరిపాడు. ఆ కర్మకాండ పూర్తికాగానే అతని రాజ్యాభిషేకానికి ప్రయత్నాలు ఆరంభమయాయి.

తిరిగి వచ్చినది మొదలు ప్రతి రోజూ శివుడికి దణ్ణం పెట్టుకునే మిషమీద కృపాణసింహుడు ఒంటరిగా బురుజు మీదికి ఎక్కి, శంఖాన్ని పూరించటానికి ప్రయత్నం చేస్తూనే ఉన్నాడు, కాని అందులోనుంచి గాలి తప్ప ఎలాటి నాదమూ రాలేదు. అందుచేత అతను ఆ శంఖం గురించి ఎవరితోనూ ఏమీ అనలేదు. రాజ్యాభిషేకం చేసుకోబోయే ముందు అతను శంఖంపూరించ వలిసి ఉంటుందని రాజపురోహితుడు సూచనగా అన్నాడు. కాని అది చాలా పాత ఆచారమని కృపాణసింహుడు తేల్చి పారేశాడు. అతను నిజంగా రాజ్యానికి వారసుడే గనక, శంఖంపూరించటం గురించి ఎవరూ పెద్దగా పట్టించుకోలేదు.

పట్టాభిషేక మహోత్సవదినం వచ్చింది. అభిషేకం మహా వైభవంగా జరిగింది. బ్రహ్మాండమైన ఊరేగింపూ, వింతలూ, వినోదాలూ, ఆటలూ, పాటలూ, సంతర్పణలూ చక్కగా జరిగాయి. ఆ రాత్రి సంస్థాన ప్రముఖులూ, ఆహ్వానితులూ విందు భోజనాలకు కూర్చున్నారు. కృపాణసింహుడి ఆనందానికి మేరలేదు.

అంతలో శంఖధ్వని వినవచ్చింది. ఒక్కసారిగా విందు సద్దడి అంతా మాటుమణిగింది. అందరూ వింతగా శంఖధ్వని ఆలకించారు.

కృపాణసింహుడి శరీరంలోని రక్తమంతా ఒక్కసారిగా కరుడు కట్టిపోయింది.

"మహారాజుగారే!" అన్నా రెవరో. ఎవరికీ ఆ విషయం సందేహం కలగలేదు. వాళ్ళు కొత్త రాజునూ, పట్టాభిషేకోత్సవాన్నీ మరిచి, భోజనాల ముందు నుంచి



లేచి బయటికి పరిగెత్తారు. కోట బురుజు మీద నిలబడి, శంఖాన్ని తదేకంగా ఊదుతున్న రణసింహుణ్ణి చూసి గుర్తించారు.

రణసింహుడు బురుజు నుంచి దిగివచ్చి తన పరివారాన్ని కలుసుకుని, "అవును, నే నే! చావలేదు! ఇంకా బతికే ఉన్నాను! నన్ను చంపటానికి ప్రయత్నించిన వాళ్ళు నన్ను నదిలో పారెయ్యటం మేలయింది. నాకు చల్లని నీటి వల్ల త్వరగా స్పృహ తెలిసింది. సమయానికి కొందరు కోయవాళ్ళు నన్ను రక్షించి, మూలికలతో చికిత్స చేశారు. హంతకులను కూడా నేను చులకనగానే పట్టుకోగలిగాను. నేను చచ్చా ననుకుని ఆ దౌర్భాగ్యులు తాము సంపాదించుకున్న డబ్బుతో విచ్చలవిడిగా జీవించసాగారు. వాళ్ళ ముగ్గురినీ హతమార్చి పగ తీర్చుకున్నాను," అన్నాడు రణసింహుడు.

"మహారాజా, ఇంత దారుణం చేయించిన వా రెవరై ఉంటారు? హంతకులకు డబ్బిచ్చి మిమ్మల్ని హత్య చేయించే సాహసం ఎవరి కుంటుందంటారు?" అని మంత్రులడిగారు.

రణసింహుడు చుట్టూ కలియజూసి, తనను చూడవచ్చిన వారిలో కృపాణసింహుడు లేకపోవటం గమనించి, "ఎవ రైతే నేం? వాడి పశ్చాత్తాపమే బతికి ఉన్నంత కాలమూ వాణ్ణి దహించి శిక్షిస్తుంది. వేరే శిక్ష అనవసరం!" అన్నాడు.

అందరూ కలిసి తిరిగి భోజనశాలకు వెళ్ళారు. అక్కడ కృపాణసింహుడు లేడు. తన అన్న తిరిగి వచ్చాడని తెలియగానే తాను మరొక తోవను కోట దాటి ఎటో వెళ్ళిపోయాడు.

మర్నాడు రణసింహుడి గౌరవార్థం మరొక ఉత్సవం జరిగింది. కృపాణసింహుడు భ్రాతృద్రోహి అని ఆబాలగోపాలానికీ తెలిసిపోయింది. అతని పేరు స్మరించిన వాళ్ళు లేరు.





# ఎలుక సహాయం

శంకరాచార్యులవారు అద్వైత బోధ చేస్తున్న కాలంలో చిదానందస్వామి అనే సన్యాసి బ్రహ్మచారి తన శిష్యవర్గంతో సహా అద్వైత బోధలు అధ్యయనం చెయ్యాలని సంకల్పించాడు. అయితే చిదానందస్వామికి గాని, ఆయన శిష్యగణానికి గాని సంస్కృత భాష అంతగారాదు. ఆ కారణం చేత ఆయన ఒక గ్రామానికి వెళ్ళి అక్కడ ఉండే మహాపండితుణ్ణి, తమ కందరికీ సంస్కృతభాష నేర్పమని అడిగాడు.

పండితుడు సంస్కృతం నేర్పటానికి తన కేమీ అభ్యంతరం లేదన్నాడు. అయితే ఆయన ధోరణి చూస్తే ఎందుకో శంకిస్తున్నట్టు కనిపించాడు.

"నాకూ, నా శిష్యులకూ సంస్కృతం నేర్పడం గురించి మీకేమైనా అభ్యంతరం ఉన్నట్టయితే చెప్పెయ్యండి," అన్నాడు చిదానందస్వామి.

"మరే అభ్యంతరమూ లేదు. మా ప్రాంత మంతటా క్షామపరిస్థితి ఏర్పడి ఉన్నది. మీరంతా ఇక్కడ కనీసం ఒక సంవత్సరం పాటుండి, దీక్షగా సంస్కృత భాషాధ్యయనం చెయ్యవలసి ఉంటుంది గద. అంత కాలంపాటు మా గ్రామస్థులు మిమ్మల్నందరినీ భిక్షలతో పోషించగలరా అని నా సందేహం," అన్నాడు పండితుడు.

"దానికేముంది? దైవేచ్ఛ ఎలా ఉంటే అలా జరుగుతుంది," అన్నాడు స్వామి.

గ్రామానికి ఒక చివరగా ఒక చిన్న మఠం ఉన్నది. చిదానందస్వామి తన శిష్యులతో ఆ మఠం ప్రవేశించాడు. పండితుడు అక్కడికి వచ్చి స్వామికి సంస్కృత పాఠం చెప్పి వెళ్ళి పోతూండేవాడు. స్వామి శిష్యులు పగటిపూట దూరగ్రామాలకు కూడా వెళ్ళి దొరికిన భిక్ష తెచ్చేవారు. దాన్ని అందరూ పంచుకుని తినేవారు. రాత్రి పూట

పి. కృష్ణంరాజు

స్వామి తన శిష్యులకు తా నా నాడు నేర్చుకున్న పాఠం బోధ చేసేవాడు. ఇలా చెయ్యటం చేత అధ్యయనం మరింత చురుకుగా సాగేది.

ఇలా ఒక వారం రోజులు గడిచింది. ఒక రాత్రి చిదానందస్వామి తన శిష్యులకు పాఠం చెబుతూండగా ఎక్కడినుంచో ఒక చిట్టెలుక వారి మధ్యకు ధైర్యంగా వచ్చి ఒక ధాన్యపు గింజను స్వామి దగ్గిర పెట్టి వెళ్ళి పోయింది. మరి కొంతసేపయాక అది మళ్ళీ అక్కడికి వచ్చి మరొక ధాన్యపు గింజను తెచ్చి స్వామి ముందుపెట్టి మళ్ళీ వెళ్ళిపోయింది.

రెండుఘడియల కాలంలో అది ఇలా అయిదారు సార్లు వచ్చి, ప్రతిసారీ ఒక ధాన్యపుగింజను స్వామి ముందు పెట్టి వెళ్ళిపోయింది.

"ఇది చాలా అపూర్వం. ఇందులో దైవ ప్రేరణ ఏదో ఉన్నది," అంటూ చిదానంద స్వామి దీపం తీసుకుని మఠం బయటికి వచ్చి చిట్టెలుక ఎటుగా వెళుతుందో నని చూశాడు. ఆఖరుసారి ధాన్యంగింజను పెట్టి వెళ్ళిపోయే చిట్టెలుక మఠానికి కొంచెం దూరంలో ఉన్న కలుగులో నుంచి పైకి వచ్చి చాలా దూరం నేల పైనే పరిగెత్తి, చిట్టచివరకు మరొక కలుగులోకి దూరి



అదృశ్యమయింది. మరి దాని జాడ కని పించలేదు. అది మాయమైన కలుగు ఎగుడుదిగుడు భూమిలో పాడుబడ్డ దిబ్బల మధ్యగా ఉన్నది.

మర్నాడు తెల్లవారగానే చిదానంద స్వామి పండితుడి వద్దకు వెళ్ళి, రాత్రి తాను చూసిన దంతా చెప్పి, "నిర్జన ప్రదేశం నుంచి ఆ ఎలుక ధాన్యపుగింజలు తీసుకు రావటం చూస్తే, ఇది పరిశోధించ దగిన విషయం లాగా కనిపిస్తుంది. గ్రామాధికారితో చెప్పి నలుగురు మనుషు లను నేల తవ్వటానికి మాట్లాడండి," అని సలహా ఇచ్చాడు.

పండితుడు గ్రామాధికారి వద్దకు వెళ్ళి, స్వామి తనతో అన్న విషయమంతా చెప్పాడు. గ్రామాధికారి పలుగులతోనూ పారలతోనూ మనుషులను వెంటబెట్టుకుని మఠానికి వచ్చాడు. చిదానందస్వామి వారి నందరినీ మఠం వెనుక ప్రాంతానికి తీసుకు పోయి, కిందటి రాత్రి చిట్టెలుక ఏ కలుగులో కైతే దూరిందో ఆ కలుగును వాళ్ళకు చూపించి, ఆ కలుగు వెంబడి తవ్వు కుంటూ పొమ్మన్నాడు.

ఒక గంటసేపు తవ్వేసరికల్లా ఒక పాడు పడిన ఇంటి శిథిలాలు భూగర్భంలో కాన వచ్చాయి. అది చాలా పెద్ద భవనం అయి ఉండాలి. ఆ భవనంలో ఒక పెద్ద నేల మాళిగా, దాని నిండా అనేక పుట్ల ధాన్యమూ బయట పడ్డాయి. ధాన్యపు రాశి మీద చిట్టెలుక కూర్చుని నిశ్చింతగా కడుపు నింపుకుంటున్నది.

గ్రామాధికారి ఆలస్యం చెయ్యకుండా ఆ ధాన్యమంతా గ్రామానికి చేరవేయించి, ఇంటింటికీ అవసరమైనంత పంచిపెట్టి, మిగిలినది కొట్లలో పోయించాడు. ఆ విధంగా ఆ గ్రామం వాళ్ళకు ఆ ఏడు ఆకలి కరువు తీరిపోయింది. మరుసటేడు వర్షాలు బాగా పడి కరువు పరిస్థితి తొలగిపోయింది.





# కృష్ణావతారం

కాళిందీ తీరాన ఒక గొప్ప గొల్లపల్లె ఉన్నది. ఆవులతోనూ, దూడలతోనూ, ఎద్దులతోనూ, రకరకాల పనులలో మునిగి ఉన్న గోపస్త్రీల తోనూ, పురుషులతోనూ అక్కడ చాలా సందడిగా ఉన్నది. వసుదేవుడి ప్రేరణతో నందుడు సకుటుంబంగా ఆ వ్రేపల్లెకు వచ్చి చేరాడు. అక్కడి వృద్ధులలో ముఖ్యులు అతనికి ఎదురువెళ్ళి, అభినందించారు. నందుడు కూడా వారితో కుశలప్రశ్నలు జరిపి, అందరినీ పేరుపేరా పలకరించి, వారి వెంట వ్రేపల్లె చేరుకున్నాడు. వృద్ధ గోపికలు నందుడి ఇంటికివచ్చి యశోదకూ, ఆమె కన్న బిడ్డకూ పురిటి వేడుకలన్నీ జరిపారు. రోహిణి వచ్చింది. నందుడామెకు తగిన మర్యాదలు చేశాడు.

గోపికలకు ఎంతో ముద్దుగా కృష్ణుడు గోపకులంలో పెరుగుతున్నాడు. కొన్ని రోజులు గడిచాయి.

గర్భస్రావాలూ, శిశుహత్యలూ చెయ్య టానికై కంసుడు అనేకమంది రాక్షసులను నియోగించాడు. వారిలో కెల్లా గొప్పది, పూతన అనేది మహాభయంకరమైన ఆకారం కలది. ఆమె రాత్రివేళ పసిపిల్ల లను వెతుక్కుంటూ వస్తూ, నందగోపుడి బండి కింద, తల్లిపక్కన పడుకుని వున్న కృష్ణుణ్ణి చూసి ఆగింది. పిల్లవాడు మంచి తేజస్సుకలిగి, అద్భుతంగా కనబడు తున్నాడు. అందరు పిల్లల్లాగా లేడు. ఒక వేళ కంసుణ్ణి చంపటానికి పుట్టినవాడు వీడేనేమో!

## 3. బాలకృష్ణ లీలలు



ఇలా అనుకోగానే పూతనకు కోపావేశం వచ్చేసింది. ఆ రాక్షసి పళ్ళు పటపటా కొరికింది. దాని మిడిగుడ్ల నుంచి నిప్పులు రాలాయి. కనుబొమలు ముడుచుకున్నాయి. నుదుట చెమట పట్టింది. ఊపిరి తీవ్రంగా ఆడింది. ఆమె ఆ పిల్లవాణ్ణి తల్లి పక్క నుంచి బలాత్కారంగా లాక్కుని, విషం పూసి ఉన్న తన చనుమొనలు వాడి నోట కుక్కింది. కృష్ణుడు కెవ్వున ఏడుస్తూ పూతన చనుమొనలు నోట గట్టిగా పట్టుకుని, బలంకొద్దీ పాలతోపాటు పూతన శరీరం లోని సప్తధాతువులనూ పీల్చాడు. నిజానికి తను పూతనను మించిన రాక్షసుడు. అందు



చేత పూతన అతి వికారమైన ఆర్తనాదం చేసి, విరుచుకు పడిపోయింది.

ఆ భయంకరమైన కేకకు మందలోగల గోపకులంతా తుళ్ళిపడి నిద్రలేచారు. కృష్ణుడు ఏడ్చినప్పుడే యశోద నిద్రలేచింది. ఆమె మేలుకుంటూనే పక్కలో పిల్లవాడు కనపడక పోయేసరికి భయపడి, నందుణ్ణి కేక పెట్టింది. నందుడు వచ్చేసరికి మిగిలిన గోపులుకూడా రానే వచ్చారు. వారికి భయంకరమైన పూతనకళేబరం కనిపించింది, దాని ఒడిలో పిట్టలాగా వాలి ఉన్న కృష్ణుడు కూడా కనిపించాడు.

యశోదానందులు తమ కొడుకును చూస్తూనే, "అయ్యో నా తండ్రీ!" అంటూ చప్పున వచ్చి బిడ్డను ఎత్తుకున్నారు.

"ఏమిటిది? ఈ రాక్షసి ఇక్కడికెలా వచ్చింది? అది వచ్చి బిడ్డనిలా చేస్తుంటే నువ్వెలా చూస్తూ ఊరుకున్నావు?" అని నందుడు తన భార్య నడిగాడు.

"బిడ్డకు కడుపునిండా పాలిచ్చి నిద్ర పుచ్చాను. దివిటీ వెలుగుతున్నది. చాలా సేపు మేలుకునే ఉండి, ఒక్కక్షణంపాటు కన్నుమూశాను. అదికూడా ఎంతో సేపు కాలేదు. ఈ రాక్షసిముండ ఎలా వచ్చిందో, పిల్లవాణ్ణి ఏం చెయ్యబోయిందో, ఇదేం





మాయో నాకేమీ తెలీదు. ఈ రాక్షసిముండకు చిక్కకూడా నా బిడ్డ ఏ కీడూ లేకుండా తిరిగి నాకు దొరికాడు. వీడికి వెయ్యేళ్ళాయుస్సు," అన్నది యశోద.

కృష్ణుడికి గొప్ప గండం తప్పిందని గోపకులంతా ఎంతో సంతోషించి, పూతన కళేబరాన్ని దూరంగా లాగేశారు. నందుడు తన కొడుకు నెత్తుకుని, వాడికి దిష్టితీసి, ఏవో మంత్రాలు చదివి, ఆశీర్వదించాడు.

రోజులు గడుస్తున్నాయి. కృష్ణుడు క్రమంగా పెరుగుతున్నాడు.

ఒకనాడు వసుదేవుడు తన పురోహితుడైన గర్గుడనే బ్రాహ్మణుణ్ణి అతిరహస్యంగా గోకులానికి పంపాడు. ఆయన వచ్చి రోహిణి కొడుకుకూ, యశోద కొడుకుకూ జాత కర్మలు జరిపి, ఆ పిల్లలిద్దరికీ రాముడూ కృష్ణుడూ అని పేరుపెట్టి, ఎంత రహస్యంగా వచ్చాడో అంత రహస్యంగా తిరిగి వెళ్ళిపోయాడు.

నందుడి ఆనందానికి మితిలేదు. అతను బ్రాహ్మణులను పిలిపించి, షడ్రసోపేతంగా భోజనాలుపెట్టి, గోవులూ, వస్త్రాలూ దానం చేశాడు. పెద్ద ఉత్సవం జరిగింది. గోకులంలో గల బంధువులందరికీ నందుడు బట్టలు పెట్టాడు. గోపూజ చేశాడు. గోవాటం



అలంకరింప చేశాడు. గోపకాంతలు యశోదను, పండంటి కొడుకును కన్నందుకు అభినందించారు. అలాగే గోపకులు కూడా నందుణ్ణి అభినందించారు.

అక్కడ మధురాపురంలో కంసుడికి పూతనకు పట్టినగతి తెలియ వచ్చింది. అతని భృత్యులయిన రాక్షసులు జరిగినదంతా అతనికి తెలిపారు. నందగోపుడి కొడుకు పైన కంసుడి అనుమానం కేంద్రీకృతమయింది. అతనికి కొంత కంపరం కూడా కలిగింది. అందుచేత అతను తన భృత్యులైన రాక్షసులను అనేకమందిని పిలిచి, నందగోపుడి కొడుకును తుద

ముట్టించమని హెచ్చరించాడు. ఆ రాక్షసులలో శకటు డనేవాడు వెళ్ళి నందుడి సొంత బండిలో అదృశ్యరూపంలో ప్రవేశించి అవకాశం కోసం నిరీక్షించసాగాడు.

యశోద కృష్ణుణ్ణి నిద్రపుచ్చి, ఆ బండి కిందనే పక్కపరిచి పడుకోబెట్టి, మిగిలిన గోపస్త్రీలతో సహా నదిలో స్నానంచేసి రావటానికి బయలుదేరి వెళ్ళింది. ఆమె వెళ్ళిన కొద్దిసేపటికి బిడ్డ మేలుకున్నాడు. దగ్గిర ఎవరూ లేకపోయేసరికి, రెండు చేతులూ నోట్లో కుక్కుకుంటూ ఏడ్చి, ముఖమంతా కళ్ళకాటుకతో కూడిన తడి చేసుకున్నాడు. కాళ్ళు తన్నుతూ ఎగిరెగిరి పడ్డాడు. అలా కాళ్ళు తన్నుకుంటూనే బండిని ఒక కాలితో తన్నేసరికి, బండి పక్కకు పడి ఛిన్నాభిన్నమయింది.

ఇంతలో యశోద స్నానం చేసి వచ్చి, పిల్లవాణ్ణి గురించి తొందరపడుతూ, గబగబా వచ్చింది. బోల్తాకొట్టి బద్దలైపోయిన బండి ఆమెకు కనిపించింది. ఆమె వెంటనే కెవ్వున అరిచి, పిల్లవాణ్ణి ఎత్తుకుని రొమ్మున అదుముకుంటూ, "అమ్మయ్యో, బిడ్డ నిద్రపోతున్నాడుగదా అని స్నానానికి వెళ్ళాను గాని, ఇప్పుడు మీ నాన్న వచ్చి, ఇదిచూసి, ఎన్నిమాటలంటాడో ఏమో. ఈ బండి ఇలా ఎందుకయిందో ఎవరు చెబుతారు? భర్త



అడిగితే నేనేం చెప్పాలి?" అనుకుంటూ, ఆమె కృష్ణుణ్ణి తొడ మీద కూర్చోబెట్టుకుని పాలివ్వసాగింది.

ఇంతలో నందగోపుడు ఒళ్ళంతా దుమ్ము కొట్టుకుని, జుట్టంతా చెదరి, చేత కణుపుల కర్ర పట్టుకుని, గోపులతో కబుర్లు చెబుతూ అక్కడికి వచ్చాడు. వస్తూనే ఊడి పోయిన చక్రాన్నీ, విరిగి పోయిన ఇరుసునూ చూసి ఒక్కసారిగా వణికిపోయాడు. ఎందుకంటే, తన కొడుకు ఎప్పుడూ ఆ బండి కిందనే గదా పడుకుంటాడు? బండి ఇంత ఛిన్నాభిన్నమై విరిగి పోయిందిగదా, బిడ్డ ఏమైనట్టు?

మరుక్షణమే అతను తన భార్యనూ, ఆమె దగ్గిర పాలుతాగుతూ, ముఖాన సంతోషమూ, చూపులు తల్లి ముఖానా గల కృష్ణుణ్ణి చూశాడు. నందుడి ప్రాణం కుదటపడింది. అతను గుండె నిమురుకుంటూ, "బండి ఇలా అయిపోయిందేం?" అని భార్యను అడిగాడు. ఏవైనా ఎద్దులు బండిని పడదోసి తొక్కాయో, లేక పెద్ద గాలి వీచిందో అని నందుడికి అనుమానం కలిగింది. "ఏమైతేనేం లే? బిడ్డడు క్షేమంగా ఉన్నాడు. అంతేచాలు," అన్నాడు మళ్ళీ నందుడు.



యశోద గద్గదకంఠంతో, "అసలు తప్పంతా నాదేలే. బిడ్డ నిద్రపోతుంటే, ఈ బండి కింద పక్కమీద పడుకోబెట్టి, దగ్గిరేగదా అని ఏటికి వెళ్ళి, స్నానం చేసి తిరిగి వచ్చి చూతును గదా ఇలా అయింది. అదృష్టం బాగుండి అబ్బాయి కీ గండం గడిచింది," అన్నది.

ఇంతలో కొంతమంది కుర్రవాళ్ళు అక్కడికి వచ్చి, "ఏమమ్మోయి, మేమిక్కడ ఆడుకుంటుంటే, మీ కృష్ణుడు కాలు చాచి ఒక్క తోపు తోసేసరికి, బండి ఇలా విరిగి పక్కకు పడింది. ఎంత చిత్రమో చూసుకోండి," అన్నారు.





యశోదానందుల ఆశ్చర్యానికీ ఆనందానికీ మేరలేదు. వాళ్ళు తమ కొడుకును ముద్దాడి, ఇంత మట్టి తీసి పిల్లవాడికి దిగదుడిచి పారేశారు. తన కొడుకును కాపాడుతూ ఉండమని నందుడు దేవతలకు దణ్ణం పెట్టుకున్నాడు. ఈలోపల పదిమందీ చేరి, జరిగిన సంగతి విని, చూసి, నిశ్చేష్టులైపోయారు. తరవాత, విరిగి పోయిన బండిని తిరిగి కూర్చి, బాగుచేసి, ఎప్పటిలాగా చేసేశారు.

రోజులు గడుస్తున్నాయి. కృష్ణుడు పెరుగుతున్నాడు. బోరగిలపడి, మంచం అంచులకు దేకుతున్నాడు. కితకితలు పెడితే కిలకిలా నవ్వి కేరింతలు కొడుతున్నాడు. నిలబెట్టి వేళ్ళు పట్టుకోవటానికిస్తే తప్పటడుగులు వేస్తున్నాడు. చప్పట్లు కొట్టి, "రా, రా," అని పిలిస్తే దగ్గిరికి వస్తున్నాడు. చూసినవాళ్ళు అతన్ని ఎత్తుకుని ముద్దాడకుండా ఉండలేరు. అందుకని మువ్వలు గలగల్లాడిస్తూ, దొంగచూపులు చూస్తూ ఎటో పారిపోతాడు. చూసేవాళ్ళు పరమానందం చెందుతారు.

తల్లి కృష్ణుడికి వెన్న గోరుముద్దలుగా చేసి రోజూ తినిపించేది. చేతి జిడ్డూ, మూతి జిడ్డూ, ఒళ్ళంతా పట్టించేది. ఉదయం పూట తల్లి కడుపు నిండా వెన్నపెట్టి గృహకృత్యాలు చూసుకోవటానికిపోతే, తప్పటడుగులు వేసుకుంటూ వెనకనే వెళ్ళేవాడు. ఆడవాళ్ళ దగ్గిరికిపోయి వెన్న పెట్టమని బతిమాలేవాడు. ఎంత పెట్టినా ఇంకా పెట్టమని వేధించుకు తినేవాడు. వెన్న చిలికేవాళ్ళ దగ్గిరికివెళ్ళి, కవ్వం తాడు పట్టుకుని కవ్వం ఆడకుండా చేసేవాడు, జుట్టుముడి ఊడతీసేవాడు, చీరెకొంగు పట్టుకుని లాగేవాడు.

"వెన్న పెడతాను గాని కాస్త ఆట చూపించరా, బాబూ," అని గోపికలు అడిగితే మువ్వలూ, మొలగంటలూ గలగలలాడుతూ ఆడేవాడు. గోపికలు చల్ల

చెయ్యటం మానేసి చూసి అనందించే వాళ్ళు. అస్తమానమూ గోకులంలో ఉండే ఇళ్ళన్నీ తిరిగేవాడు. వాడితో వేగలేక గోపికలు నలుగురూ నాలుగు పక్కలనుంచి, "పట్టుకోండి, పట్టుకోండి," అంటూ ఒకరినొకరు హెచ్చరించుకుంటూ వచ్చి, పట్టుకుని యశోదకు అప్పజెప్పేవాళ్ళు.

కాలం గడుస్తున్న కొద్దీ కృష్ణుడి ఆటలు మారి పోతున్నాయి. గోపబాలకు లందరూ బలరామ కృష్ణుల చుట్టూ చేరేవాళ్ళు. అందరూ కలిసి ఒక దండులాగా వ్రేపల్లె అంతా చెడ తిరిగేవాళ్ళు. కృష్ణుడు కుండల్లోనూ, చట్లలోనూ ఉండే పాలూ, నెయ్యీ తాగేవాడు, తాగినంత తాగి, మిగిలినది నేలమీద పోసి, కాళ్ళతో మట్టగించేవాడు. అలాటి చిలిపి చేష్టలు చెయ్యకుండా ఆపటం ఎవరివల్లా అయేదికాదు. పాలసముద్రం మధించగా వచ్చిన అమృతాన్ని మోహిని దేవతలకు పంచినట్టుగా, కృష్ణుడు గోపికల ఇళ్ళలోని పాలూ, మీగడా తాను తినటమే గాక తన వెంట ఉన్న కుర్రకారు కంతకూ పంచిపెట్టేవాడు. ఉట్లు తెంచేవాడు, బానలు దొర్లించేవాడు, కడవల్లో పాలు సగం తాగి వాటిని చల్లతో మళ్ళీ నింపేవాడు. నెయ్యి తీసుకుపోయి నిప్పులోపోసి భగ్గున మంటలు లేపేవాడు. పెరుగులో పాలూ, వెన్నలో పెరుగూ, చల్లలో నెయ్యీ కలిపేసేవాడు. దూడలను విప్పి ఆవుల పాలు తాగెయ్యనిచ్చేవాడు. కొన్నిటిని కట్లు విప్పి వదిలేసేవాడు. కావళ్ళ తాళ్ళు తెంచేసేవాడు. పిల్లలందరినీ చేర్చి ఆటలాడేవాడు. ప్రతి ఆటలోనూ అందరినీ ఓడించి, వీపు పగిలేటట్టు కొట్టేవాడు, ఒక్కొక్కడి వీపునా ఎక్కి మోయించుకునేవాడు. ఆటల్లో ఎంత మొనగాణ్ణయినా ఏడిపించుకు తినేవాడు.

ఈ విధంగా కృష్ణుడు గోకులాన్నంతా ఒక కొలిక్కి తెస్తుంటే గోపకులు ఏం చెయ్యాలో తోచక నిశ్చేష్టులైపోయారు.





# అరణ్యపురాణం

## 6

మౌగ్లీ మనిషి భాష నేర్చుకోవటానికి నిశ్చయించుకున్నాడు. మనిషి అయాక మనిషి మాట అర్థం కాకపోతే లాభమేమిటి? అరణ్యంలో ఉన్నప్పుడు అతను అన్ని జాతుల భాషా నేర్చుకున్నాడు. మేస్సువా నోట ఏ మాట వచ్చినా మౌగ్లీ ఆ మాట తాను కూడా అనేవాడు. చీకటి పడేలోపుగా అతనికి ఆ గుడిసెలో ఉండే అనేక వస్తువుల పేర్లు నోటికి వచ్చాయి.

పడక విషయంలో పెద్ద పేచీ వచ్చింది. పులిబోను లాగున్న ఆ గుడిసెలో పడుకోవటం మౌగ్లీకి ఎంత మాత్రమూ సమ్మతం కాలేదు. వాళ్ళు తలుపు మూసేస్తే, అతను కిటికీ గుండా బయటికి వెళ్ళాడు.

"వాడి ఇష్ట ప్రకారమే పోనీ. ఇప్పటి దాకా వాడు పక్కపైన పడుకుని ఎరగడన్నది గుర్తుంచుకో. వాడు మన పిల్లవాడికి బదులు పంపబడ్డవాడే అయితే మనని విడిచి ఎక్కడికీ పోడు," అన్నాడు మేస్సువా భర్త. మౌగ్లీ వెళ్ళి, పొలం పక్కన స్వచ్ఛమైన పచ్చికనేల మీద పడుకున్నాడు.

అతనికి జరిగిన సంగతులన్నీ స్మరణకు వచ్చాయి. ఆనాడు బాఘీర ఎర్రపువ్వు తెమ్మన్నప్పు డతను కొండ కిందికి వెళ్ళి ఒక ఇంటి నుంచి కొంత నిప్పును ఒక చట్టిలో తస్కరించి అరణ్యానికి తిరిగి వెళ్ళాడు. గతరాత్రి అకేలా వేటలో పరాభవం పొందాడు. అతను మంద ఇచ్చే శిక్షకు పాత్రుడయాడు. మంద మౌగ్లీ కోసం ఆ రాత్రంతా వెతికిందట, బాఘీర చెప్పాడు. మౌగ్లీ ఆ రోజల్లా ఎండుకొమ్మలతో చట్టిలోని నిప్పును రాజ చేస్తూ వచ్చాడు. ఆ రాత్రే కొండశిఖరాన మంద సమవేశమయింది. షేర్‌ఖాన్ మాట్లాడాడు. షేర్‌ఖాన్‌కు మంద

అట్ట చివరి బొమ్మ





కాలితో నిప్పులను ఎగదన్నాడు. ఆ తరవాత మౌగ్లీ తన తోడేలమ్మ కుటుంబానికి వీడ్కోలు చెప్పి వచ్చేశాడు.

అతను కళ్ళు మూసేలోపల అతని గడ్డం కింద మెత్తని ముక్కు తగిలింది.

ఆ వచ్చినది పెద్దన్న–అంటే తోడేలమ్మ పెద్ద కొడుకు.

"ఛీ! ఛీ! నీ కోసం వెతుక్కుంటూ ఇరవై మైళ్ళు వచ్చినందు కిదా ఫలితం? నీ ఒళ్ళు కట్టెల పొగ వాసనా, పశువుల కంపూ కొడుతున్నది. అప్పుడే మనిషి అయి పోయావు. లే, బుల్లి తమ్ముడూ, నీకో వార్త తెచ్చాను," అన్నాడు పెద్దన్న.

మౌగ్లీ వాణ్ణి కౌగలించుకుని, "అరణ్యంలో అంతా కులాసా?" అని అడిగాడు.

"ఎర్రపువ్వు కాలినవాళ్ళు తప్ప అంతా కులాసాయే. విను, షేర్‌ఖాన్ బొచ్చు బాగా కాలింది కాదూ? అది తిరిగి పెరిగేదాకా ఇంకెక్కడో వేటాడబోయాడు. తిరిగి వచ్చాక నీ దుమ్ములు వాయిన్‌గంగలో కలుపుతానని శపథం చేశాడు," అన్నాడు పెద్దన్న.

"దానికేంలే? నేనూ చేశానొక శపథం. కాని వార్తలు తెలియటం అవసరం. నువు మటుకు ఎప్పటి వార్త లప్పుడు చెబుతూ ఉండు—నా కిప్పుడు నిద్ర ముంచు కొస్తు

నాయకత్వం గురించి మాట్లాడే అధికారం లేదని మౌగ్లీ ఆక్షేపించాడు. కాని మంద అతని ఆక్షేపణను తిరస్కరించి, "నోరు ముయ్యరా, మనిషికూనా!" అన్నది. ఆ మనిషికూన తనదని షేర్‌ఖాన్ అన్నాడు. మంద ఉద్రేకం చెంది మౌగ్లీని చంప సిద్ధపడింది. మౌగ్లీ లేచి నిలబడి తన నిప్పుల చట్టిని మంద మధ్యకు విసిరాడు. విసిరే ముందు ఎండుకొమ్మను చట్టిలో పెట్టాడు. అది భగ్గున మండింది. మంటలూ, నిప్పులూ చూసి మంద హడలిపోయింది. షేర్‌ఖాన్ బొచ్చు కాలింది. మౌగ్లీ అతన్ని సమీపించి, "లేచి నిలబడు, కుక్కా!" అంటూ

న్నది, పెద్దన్నా. కొత్త విషయాలు అలవ
గొట్టాయి," అన్నాడు మౌగ్లీ.

"నువ్వు మనుషుల మాయల్లో పడి తోడేలు నన్ను సంగతి మరిచేవు సుమా?"

"ఎలా మరుస్తాను? నిన్నూ, మన గుహలో వాళ్ళనూ ఒక్కనాటికి మరవను. నన్ను మంద నుంచి వెళ్ళగొట్టా రన్నది కూడా మరవను."

"నిన్ను మళ్ళీ మరొకమంద నుంచి వెళ్ళ గొట్టకుండా చూసుకో. మనుషులు మనుషులే. వాళ్ళు మాట్లాడుతుంటే చెరువులో కప్పలు బెకబెక లాడినట్టుంటుంది. నే నీ సారి వచ్చినప్పుడు పచ్చికబీడు చివర వెదుళ్ళ పొదలో నీ కోసం వేచి ఉంటాను," అని పెద్దన్న వెళ్ళిపోయాడు.

ఆ తరవాత మూడు నెలలపాటు మౌగ్లీ దాదాపు గ్రామద్వారం దాటి వెళ్ళలేదని చెప్పవచ్చు. అతను మనుషుల పద్ధతులు అలవరుచు కోవటంలో నిమగ్నుడయాడు. మొట్టమొదట అతని మొల కొక బట్ట చుట్టారు; అది చాలా దుర్భరమనిపించింది. తరవాత డబ్బు గురించి తెలుసు కోవలిసొచ్చింది; అది చచ్చినా అర్థం కాలేదు. అలాగే పొలం దున్నటం వల్ల ప్రయోజనమేమిటో అంతుబట్ట లేదు.



ఊరి పిల్లకారు అతనికి చాలా కోపం తెప్పించారు. అరణ్యంలో పెరిగినవాడు గనక అతను తన కోపాన్ని సులువుగా నిగ్రహించుకున్నాడు—అరణ్యంలో ప్రాణమూ, తిండీ దక్కించుకోవాలంటే ఆవేశం కూడదు. కాని ఊరిపిల్లలు, తాను ఆటలకు రాడనీ, గాలిపటా లెగరెయ్యడనీ ఎద్దేవా చేసినా, తన మాటల ఉచ్చారణ చూసి వెటకారం చేసినా, చీల్చి చెండాడాలనిపించేది. కూనలను చంపటం అనుచితమని ఊరుకునేవాడు. తన కెంత బలం ఉన్నదో మౌగ్లీకి కొంచెం కూడా తెలీదు. అరణ్యంలో తన కన్న చాలా బలం గల

జంతువులుండేవని అతనికి తెలుసు. గ్రామంలోవాళ్ళు మాత్రం అతనికి ఎద్దు కున్నంత బలం ఉన్నదనేవాళ్ళు.

మనుషుల్లో ఉండే కుల వ్యత్యాసాలు మౌగ్లీకి బొత్తిగా తెలీవు. కుమ్మరివాళ్ళ గాడిద అడుసుగుంటలోకి జారిపడితే, మౌగ్లీ దాన్ని తోకపట్టి పైకిలాగి, సంతకు పోతున్న కుండలను సర్ది అమర్చటానికి సాయం చేశాడు. అది చాలా తప్పు. కుమ్మరి తక్కువ కులంవాడు. గాడిద మాట వేరే చెప్పేదేమిటి? పురోహితుడు మౌగ్లీని గట్టిగా మందలించాడు.

"నిన్ను కూడా ఆ గాడిద మీద కుండలతో బాటు ఎక్కిస్తాను," అన్నాడు మౌగ్లీ పురోహితుడితో.

పురోహితుడు మెస్సువా మొగుడి దగ్గిరికి వెళ్ళి, "కుర్రవెధవను సాధ్యమైనంత త్వరలో ఏదైనా పనిలో పెడితే మేలు," అని చెప్పాడు.

గ్రామపెద్ద మౌగ్లీని పిలిచి, "రేపటి నుంచీ నువు గేదెల వెంట వెళ్ళి వాటిని మేపుకు వస్తూ ఉండు," అన్నాడు. మౌగ్లీకి అంతకంటె కావలిసిందేమిటి? తానిప్పుడు ఒక విధంగా గ్రామోద్యోగి అయాడు గనక అతను ఆ సాయంకాలం రావిచెట్టు కింద జరిగే సమావేశానికి వెళ్ళాడు. అది రచ్చబండ. గ్రామపెద్దా, తలారీ, మంగలీ, షికారీ వాడు బలదేవుడూ అక్కడ చేరేవాళ్ళు, పొగ తాగేవాళ్ళు. చెట్టుకొమ్మల్లో కోతులు చేరి మాట్లాడుకునేవి. చెట్టు కింది అరుగు కలుగులో తాచుపాముండేది. అది పవిత్రమైనది కావటంచేత దానికి ప్రతిరాత్రీ పాలు ముట్టేవి. పెద్దలు చెట్టు చుట్టూ చేరి, హుక్కా తాగుతూ, చాలా పొద్దుపోయినదాకా మాట్లాడుకునేవాళ్ళు. వాళ్ళు దేవతలను గురించీ, మనుషులను గురించీ, దయ్యాలను గురించీ అద్భుతమైన విషయాలు చెప్పుకునేవాళ్ళు. —(ఇంకావుంది)



# 60. అతిప్రాచీన గుహా చిత్రాలు

మధ్య ఫ్రాన్సులో గల గుహలలో **20,000** ఏళ్ళనాటి శిలాయుగపు మానవులు ఈ అద్భుతమైన చిత్తరువులు రచించారు. వీటిని చిత్రించిన వేటగాళ్ళు తాము వేటాడిన గుర్రాలనూ, ఇతర పశువులనూ పరుగుతీస్తున్నట్టు, వేలును రంగులో ముంచీ, ఎముక గొట్టాలతో రంగు ఊదీ చిత్రించారు.



Photo by K. K. Nair



బహుమతి
పొందిన వ్యాఖ్య

నేస్తాల సరసాలు నేటితో సరి, కొమ్మ

పంపినవారు ;
కె. శుభావతి, మాకవరపాలెం

Photo by K. N. Malli



బహుమతి పొందిన వ్యాఖ్య

సూకలచేటే, అమ్మ, నిక్కంపు నేస్తం

పంపినవారు : కె. శుభావతి, మాకవరపాలెం

# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1967 జనవరి నెల సంచికలో ప్రకటించబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ నవంబర్ నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26.

## నవంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : నేస్తాల సరసాలు నేటితో సరి, కొమ్మ

రెండవ ఫోటో : నూకల చేటే, అమ్మ, నిక్కంపు నేస్తం

పంపినవారు : కె. శుభావతిఅమ్మన్నపట్నాయక్,

మాకవరపాలెం (విశాఖపట్నం జిల్లా)

బహుమతి మొత్తం రు. 10/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. NAGI REDDI at The B. N. K. Press Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

ఆదనపు
తెలుపుదనము
ఎక్కడ నుంచి
వస్తుంది ?

Tinopal

# టినోపాల్ తో అన్నింటికంటె హెచ్చు తెల్లదనం వస్తుంది

ఆఖరిసారి బట్టలు జాడించడానికి ముందు కాస్త టినోపాల్ వేయండి. మరిచూడండి, మీ తెల్ల బట్టలన్నీ మిరుమిట్లు గొలిపేలా మెరుస్తాయి. షర్టులు, చీరెలు, తువ్వాళ్లు, దుప్పట్లు—ప్రతిదీ అదనపు తెల్లదనం పొందుతుంది.

ఈ అదనపు తెల్లదనం మూలంగా మీకు ఖర్చు ఎంతో ? ఒక బట్టకు ఒక పైసా కూడా కాదు. ఒక డార్సెను బట్టలను తెలుపు చేయడానికి ఒక పావు చిన్న చెమ్చాడు చాలు.

శాస్త్రీయంగా తయారుచేసిన లైవర్ టినోపాల్ నే సర్వదా ఉపయోగించండి. ఇది బట్టలకు ఏ విధంగానూ చెరపు (హాని) చేయదు.



ఇప్పుడు సీలుచేసిన అల్యూమినియం ఫాయిల్ పేకెట్ లో కూడా దొరుకుతుంది.

ఒక పేకెట్ తో ఒక డార్సెను బట్టలు తెలుపు అవుతాయి. ఉపయోగించడం సులభం—ఎటువంటి వృథా లేదు. ఒక డార్సెనుకు ఒక పేకెట్ చాలు.




టినోపాల్, జె. ఆర్. గైగి ఎస్. ఎ., బాసిల్, స్విట్జర్లండ్ వారి రిజిస్టర్డు ట్రేడ్ మార్కు.
సుహృద్ గైగి లి. పి. ఒ. బాక్సు 965, బొంబాయి-1. బి. ఆర్.

Shilpi SG 223 A Tel




# అమృతాంజనం వాడి
## శీఘ్రంగా నివారణ పొందండి

నిరపాయకరంగా గుండె జలుబుకు, సాధారణ జలుబుకి అమోఘంగా గుణాన్నిచ్చే అమృతాంజన్ 10 రకాల ఔషధాల చేరిన మందు. కంఠనొప్పికి, తలనొప్పికి, బెణుకులకు కూడా అమోఘంగా పనిచేస్తుంది. కొంచెం కొంచెమే ఉపయోగించ వలసి ఉంటుంది కొబట్టి ఒక సీసా మీ కుటుంబానికి కళ్ళా నెలల తరబడి వస్తుంది.

అవసరానికి ఎప్పుడూ అమృతాంజన్ ఉంచుకోండి. అమృతాంజన్ 70 ఏళ్ళ ప్రసిద్ధిపొందిన నమ్మకమైన గృహ ఔషధం.

అమృతాంజన్ నొప్పులు జలుబుల నివారణకు 10 రకాల ఔషధాల చేరిన మందు.




అమృతాంజన్ లిమిటెడ్
మద్రాసు · బొంబాయి · కలకత్తా · ఢిల్లీ

"దీపావళి శుభాకాంక్షలు!"

# "దీపావళి శుభాకాంక్షలు!"

